# ప్రథమ తెలంగాణా కమ్యూనిష్టు మహాసభ

**1954 ఆగష్టు 1 నుండి 9 వరకు**



# తీర్మానాలు





ప్రచురణ:

తెలంగాణా కమ్యూనిష్టు కమిటీ,
హైదరాబాదు.

1-0-0

# ముందుమాట

ప్రథమ తెలంగాణా కమ్యూనిస్టు మహాసభ ఆగష్టు 1 నుండి 9 వరకు హైదరాబాద్ పట్టణంలో జరిగింది. వివిధ జిల్లాల నుండి రైతాంగ పోరాటంలో కాకలుతీరిన యోధులు, కార్మికనాయకులు మొత్తం 204 గురు ప్రతినిధులు, 12 మంది వోటుఅధికారంలేని ప్రతినిధులు, పొలిట్‌బ్యూరో సభ్యులు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య, శ్రీ చండ్ర రాజేశ్వరరావుగార్లు మహాసభకు హాజరయ్యారు. ఆంధ్రనుండి కార్యదర్శితోసహా 6 గురు సౌహార్ద్రప్రతినిధులువచ్చారు. ఆంధ్రకమిటీ కార్యదర్శి మద్దుకూరి చంద్రశేఖరరావుగారు జెండా నెగురవేస్తూ "పీడిత ప్రజాకోటి తమ విముక్తికోసం సాగిస్తున్న పోరాటంలో నేలకొరిగిన మృతవీరుల రక్తంతో ఎరుపెక్కిన ఎర్రజెండా, ఆంధ్రజాతికి గర్వకారణమైన తెలంగాణాపోరాటంలో అసువు లర్పించిన మృతవీరుల రక్తంతో మరింతఎరుపెక్కింది. ఈ జెండా ప్రతిష్ఠను కాపాడడానికి ప్రతి ఒక్కరు శపథం చేయాలి"న్నారు.

తర్వాత జరిగిన సమావేశంలో తెలంగాణా అమరవీరులకు ప్రపంచ ప్రజానాయకుడు స్టాలిన్‌కు, జెక్ నాయకులు గోట్వాల్డుకు జోహారు లర్పించబడ్డాయి.

వివిధ రాష్ట్రాలనుండి, జైలు క్యాంపులనుండి వచ్చిన 17 సౌహార్ద సందేశాలు వినిపించబడ్డాయి.

తరువాత ఎనిమిది రోజులలోను ఇదివరకే ప్రచురించబడిన నిర్బంధవిధానం, విశాలాంధ్ర, జెనీవా సమావేశం, విదేశస్థావరాలు, లావుణీ భూములమీద తీర్మానాలు కాక, రాజకీయ తీర్మానం, నిర్మాణ తీర్మానం, పి. డి. యఫ్. మీద తీర్మానం, ట్రేడ్‌యూనియన్ రంగాలమీద తీర్మానం, దీర్ఘ చర్చల తరువాత ఆమోదించబడ్డాయి. వ్యవసాయ రంగంలో

మన కర్తవ్యాలు అను డాక్యుమెంటుమీద చర్చలు జరిగిన తరువాత, దానికి తుది స్వరూపమివ్వటానికి నూతన రాష్ట్రకమిటీకి అధికారమివ్వబడినది. పొలిట్‌బ్యూరోసభ్యులు శ్రీ సుందరయ్యగారు ఎన్నిలోపాలున్నా తెలంగాణాపోరాటంలో ఎన్నో మహత్తర విజయాలను సాధించామనీ, అభిప్రాయ భేదా లున్నప్పటికీ వాటిని సంరక్షించడం అందరి బాధ్యతఅనీ, అందుకు పార్టీలో చీలికలు అంతరింపజేసి ఐక్యపరచడం అవసరమనీ ప్రతినిధుల నుద్బోధించారు. పార్టీ కార్యకర్తలు పార్టీకి పెద్ద పెట్టుబడిఅనీ వారిని కంటికి పాపవలె కాపాడాలనీ హెచ్చరించారు. పి. బి. సభ్యులు శ్రీ చంద్ర రాజేశ్వరరావుగారు సందేశమిచ్చిన తదుపరి అంతర్జాతీయ గీతంతో హర్షధ్వానాలమధ్య మహాసభ జయప్రదంగా ముగిసింది. రాజేశ్వరరావుగారు చెప్పినట్లు యీ మహాసభ గతంలో పార్టీసాధించిన విజయాలను రక్షించుకొనటానికి, భవిష్యత్తులో పార్టీ ఐక్యంగా పురోగమించి నూతన విజయాలను సాధించటానికి ప్రాతిపదిక నేర్పరిచింది.

ఈపుస్తకంలో నాలుగు ప్రధానతీర్మానాలు, రాజకీయ, నిర్మాణ, పి. డి. యఫ్. ట్రేడ్‌యూనియన్ రంగాలమీదకి అందిస్తున్నాము. త్వరలోనే వ్యవసాయరంగంలో మన కర్తవ్యాలు అన్న డాక్యుమెంటునుకూడ అందించగలం. వీటిని పార్టీసభ్యులందరు క్షుణ్ణంగా అధ్యయనంచేసి అమలులో పెట్టుట ద్వారా ప్రజాఉద్యమాన్ని నూతన పద్ధతులమీద బలవత్తరంగా పునర్నిర్మించుతారనీ, పార్టీలో ఐక్యతను సాధించి పార్టీని సుశిక్షితమైన అగ్రగామిగా తయారుచేస్తారనీ తెలంగాణా కమిటీ ఆశించుతూ ఉంది.

హైదరాబాదు,
12-8-54.

**బద్దం యల్లారెడ్డి,** కార్యదర్శి,
తెలంగాణా కమ్యూనిస్టు కమిటీ.

5-4

# రాజకీయ తీర్మానం

## తెలంగాణాలో నేటి పరిస్థితులు - మన కర్తవ్యం

తెలంగాణా ప్రజలు తమ చరిత్రప్రసిద్ధమైన పోరాటం ద్వారా తమను తరతరాలనుండి పీల్చి పిప్పిజేస్తున్న మధ్య యుగాలనాటి దోపిడీవిధానం, నైజాం నిరంకుశత్వాల పునాదులను బ్రద్దలుకొట్టారు. లక్షల ఎకరాల భూములను పంచుకొని వీరోచిత పోరాటంద్వారా వాటి రక్షణకు పూనుకొని భారత రైతాంగానికే మార్గదర్శకులయ్యారు.

ఈ పోరాటంలో యెంతోమంది వీరయోధులు బలి అవడం, వేలాదిజైళ్ళలో తీవ్ర నిర్బంధాలకు గురిఅవడం, ప్రజలు లాఠీదెబ్బలు, కాల్పులు, గృహదహనాలు, మానభంగాలు, మొదలైన రాక్షసకృత్యాలకు యెదురొడ్డి నిలబడడంద్వారా ఆంధ్రప్రజల చరిత్రలోనే సువర్ణాక్షరాలతో లిఖింపదగిన విప్లవ సాంప్రదాయాలు నెలకొల్పారు.

ఇట్టి చారిత్రక పోరాటానికి నాయకత్వంవహించి యెనలేని త్యాగాలుచేసి, అగ్నిపరీక్షలో నిగ్గుతేలుటవలన కమ్యూనిస్టుపార్టీ తెలంగాణాప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నది. వారి హృదయాలలో శాశ్వతమైన స్థానాన్ని సంపాదించుకొన్నది.

ఇట్టి పరిస్థితులలో 1952లో భారతదేశమంతటా రాష్ట్ర, కేంద్ర శాసనసభలకు కాంగ్రెసు ప్రభుత్వం ఎన్నికలుజరిపింది. హైదరాబాదు రాష్ట్రంలో ఈ ఎన్నికలలో మెజారిటీ సంపాదించి తన నిరంకుశ పాలనను ప్రజాస్వామ్యపు ముద్రవేసుకుందామనిఆశించింది. పోలీసు క్యాంపులువుంచి, నిర్బంధవిధానాన్ని కొనసాగించడం, కమ్యూనిస్టుపార్టీమీద నిషేధాన్ని తొలగించడం వేలాది కమ్యూనిస్టుపార్టీ నాయకులను, కార్యకర్తలను జైళ్ళలో నిర్బంధించివుంచడం, రహస్యజీవితం సాగించాల్సిన పరిస్థితులను కొనసాగించడంద్వారా కమ్యూనిస్టుపార్టీకి బహిరంగంగా ఎన్నికలలో పాల్గొనే అవకాశాన్ని లేకుండా చేసింది. అయినప్పటికీ కమ్యూనిస్టుపార్టీ రాష్ట్రంలోని యితర ప్రజాస్వామ్యవాదులతో చేతులుగలిపి, జనతంత్ర సంఘటనద్వారా ఎన్నికలలో పాల్గొన్నది.

ఇంతటి తీవ్ర నిర్బంధ పరిస్థితులను సైతం లెక్క-చేయకుండా తెలంగాణా ప్రజలు జనతంత్ర సంఘటన ప్రతినిధులకు ఓట్లువేసి, అమోఘ విజయాన్ని చేకూర్చారు. తెలంగాణాలో పోటీచేసిన (44) స్థానాలకు (36) స్థానాలను గెలవడం జరిగింది. ఇతరచోట్ల కమ్యూనిస్టుపార్టీకి పలుకుబడి వున్నప్పటికీ ఓటింగు అర్హతకలిగిన అభ్యర్థులు దొరకనందున, తగిన వ్యవధి లేకపోవుట వలన చాలాస్థానాలు వదలివేయవలసివచ్చింది. కొన్ని ప్రాంతాలలో కమ్యూనిస్టుపార్టీ పేరు ఉపయోగించుకొని సోషలిస్టులు, స్వతంత్రులు సీట్లు గెల్చుకోవడంగూడా జరిగింది! ఈ ఎన్నికల విజయాలు కాంగ్రెసు నాయకమ్మన్యులకు, యితర అభివృద్ధి నిరోధకులకు ఆశ్చర్యాన్ని, భీతిని కలిగించాయి. ఈ అద్వితీయ

మైన ఎన్నికల విజయాలద్వారా కాంగ్రెసు నిరంకుశ పాలనకు చావుదెబ్బకొట్టి, తెలంగాణా ప్రజలు ఈ నూతన పరిస్థితుల్లో తమ పోరాట విజయాలను కాపాడడానికీ, విస్తృతం చేయడానికీ కమ్యూనిస్టుపార్టీ చేతిలో ఒక బలమైన ఆయుధాన్ని పెట్టారు.

ఎన్నికల్లో విజయం సాధించి, ప్రజాస్వామ్యం ముద్ర వేసికొని తద్వారా కమ్యూనిస్టుపార్టీని, తెలంగాణా ప్రజాపుద్యమాన్ని అణచివేద్దామని, తెలంగాణా పోరాట విజయాలను వమ్ముచేద్దామని ఆశించిన కాంగ్రెసు ప్రభుత్వం, ఈ ఎన్నికల అపజయంతో రాజకీయంగా దెబ్బకాచుకునే స్థితిలో పడిపోయినది.

తెలంగాణా ప్రాంతంలో మెజారిటీసీట్లు సంపాదించుకోలేకపోయినా మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలలో కాంగ్రెసుకు వచ్చిన మెజారిటీ సీట్లతో తిప్పలుబడి మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసి తిరిగి అధికారంలో కూర్చోగలిగింది. కాంగ్రెసు ప్రభుత్వం ఎన్నికలకు పూర్వం తన అస్తిత్వానికి ప్రధానంగా నిర్బంధ విధానం మీదనే ఆధారపడుతూ వచ్చింది. ఎన్నికలఅనంతరం నగ్నమైన నిర్బంధవిధానంతోటే తన పరిపాలనను నిలబెట్టుకోలేనని గ్రహించింది. ఈ నిర్బంధ విధానాన్ని కొంత సడలిస్తూ దానికితోడుగా అంతక్రితమే ప్రారంభించిన యితర ఎత్తుగడలకు సమగ్ర స్వరూపమిచ్చింది

గ్రామీణ ప్రజలలో చీలికలు పెట్టడం, నూతన వ్యవసాయ పద్ధతులు, ప్రాజెక్టులు మొదలైన కార్యాలద్వారా ప్రజల్లో పై వర్గాలను వెనుకవేసుకోవడం మొదలు పెట్టింది.

ఈవిధంగా ఒకవైపున ప్రజావుద్యమాన్ని చీల్చడం, తన పునాదిని విస్తృతం చేసుకోవడం, మరొకవైపున నిర్బంధ విధానాన్ని యింకా కొనసాగించడం ద్వారా ప్రజోద్యమాన్ని అణచడానికి పూనుకుంది.

తెలంగాణా పోరాటంవల్ల ప్రజల్లో విప్లవచైతన్యం రావడంతోపాటు భూస్వాములు, ఇతర అభివృద్ధి నిరోధకులు మొదలైన శత్రువర్గాల బుర్రలలోకూడా ప్రధానమైన మార్పు లొచ్చినవి. వారుకూడా నగ్నమైన ఫ్యూడల్ దోపిడీ, నిరంకుశ విధానాలను యథాతథంగా కొనసాగించడం ఇక సాధ్యంకాదని తెలుసుకున్నారు. వారు కాంగ్రెసు ప్రభుత్వంతో పాటు ఈ నూతన పరిస్థితులలో తమ వర్గప్రయోజనాల రక్షణకు నూతన ఎత్తుగడలతో ముందుకు వచ్చారు. గ్రామాలలో బంచరాయి, పోరంబోకు సమస్యలను తీసుకుంటూ వ్యవసాయ కూలీలు, రైతులమధ్య చీలికలు పెట్టడం, తమ కౌలు భూములమీద వ్యవసాయకూలీలకు ఆశచూపించి, ఉపకొల్పడం చేస్తూ, భూమిలేని వ్యవసాయకూలీల, పేదరైతులయొక్క భూదాహాన్ని వక్రమార్గాలు పట్టించుతున్నారు. ప్రభుత్వం తయారుచేసిన కమ్యూనిటీ ప్రాజెక్టు, ఇరిగేషన్ ప్రాజెక్టులు, కోఆపరేటివులు మొదలయిన ప్రజోపయోగ స్కీములనూ, పంచాయతీబోర్డులు, మునిసిపాలిటీలు మొదలయిన స్థానిక స్వపరిపాలక సంస్థలనూ, స్కూళ్ళు, కాలేజీలు మొదలయిన విద్యాసంస్థలనూ ఉపయోగించుకొని తమ పలుకుబడిని పెంచుకోడానికి, కాంగ్రెసు ప్రభుత్వానికి బలం చేకూర్చడానికి ప్రయత్నిస్తున్నారు.

ఇట్టి నూతన పరిస్థితులలో, ఫ్యూడల్ దోపిడీ, నిరంకుశ ప్రభుత్వ విధానాలు నగ్నంగా నాట్యం చేస్తున్న రోజుల్లో, మనం అవలంబించిన ఎత్తుగడలు పనికిరావు. మనంగూడా నూతన ఎత్తుగడలూ, నినాదాలతో ముందుకు వచ్చినప్పుడే శత్రువు కుట్రను భగ్నంచేసి, ప్రజోద్యమాన్ని నూతన ఫక్కీలో పునర్నిర్మించగలుగుతాము.

వివిధ పార్టీ కమిటీలు, ప్రభుత్వం శత్రువర్గాలయొక్క ఈ నూతనఎత్తుగడల ఫలితాలను ఆచరణలో చూస్తూ, వాటికి ప్రతిఎత్తులకోసం తడుములాడుతూ వచ్చారు. గ్రామాల్లో భూమి తగాదాల విషయంలో నూతన పద్ధతుల్లో ప్రజల నైక్యపరచ డానికి ప్రయత్నించారు. కొన్నిచోట్ల ప్రత్యేక వ్యవసాయ కూలీసంఘాల అవసరాన్ని గుర్తించి, వాటిని ఏర్పరచారు. మున్సిపాలిటీలు పంచాయితీల ఎన్నికల్లో పాల్గొని వాటిని ప్రజల కోసం ఉపయోగించడం మొదలు పెట్టారు. స్కూళ్ళ కాలేజీల కోసం ప్రయత్నాలు కూడ చేశారు. వీటిల్లో కొన్ని విజయా లను గూడ సాధించారు.

అయితే పై కార్యకలాపాలను పార్టీకమిటీలు తీసు కున్నా, ఇంతవరకు మన పార్టీ, ప్రభుత్వం అభివృద్ధినిరోధకవర్గాల యొక్క ఎత్తుగడల సమగ్ర స్వరూపాన్ని అవగాహన చేసుకొని, నూతనపరిస్థితుల కనుగుణ్యమైన మన ఎత్తుగడలను, నినాదాలను రూపొందించలేకపోయింది. అందుచేతనే ఎన్నికల విజయా లతో ఏర్పడిన మహత్తర అవకాశాలను పూర్తిగా సద్వి నియోగం చేసుకొని, శత్రువర్గాలను వేరుజేసి, వారు తెలంగాణా ప్రజోద్యమం కమ్యూనిస్టుపార్టీల మీద సాగించుతున్న దాడిని త్రిప్పికొట్టలేకపోయాం.

నేటి పార్టీలోని అంతర్గత సంక్షోభానికి మూలకారణం గత తెలంగాణా పోరాటంలోని కొన్ని హంశాలమీద పార్టీలో ఏర్పడిన తీవ్రమైనఅభిప్రాయ భేదాలే. వాటిని పరిష్కరించుకున్నప్పుడే పార్టీలో పూర్తి ఐక్యత చేకూరుతుంది. అయితే గత పోరాటంలోని కొన్ని హంశాలమీద ఏకాభిప్రాయం లేక పోయినా, ఒకవైపున ఎన్నికల అనంతరం ఏర్పడిన నూతన పరిస్థితుల కనుగుణ్యమైన ఎత్తుగడలను రూపొందించి మరొకవైపున పార్టీ పద్ధతులను, క్రమశిక్షణను అమలుజరుపుతూ పురోగమించినట్లయితే, పార్టీ యొక్క అంతర్గత పరిస్థితి నేటివిధంగా ఉండేదికాదు. ప్రజా సమస్యలమీద పార్టీని ఐక్యపరుస్తూపార్టీ పరిస్థితిని క్రమక్రమంగా చక్కబరచడానికి అవకాశ మేర్పడేది. నూతన పరిస్థితుల కనుగుణ్యమైన ఎత్తుగడలను రూపొందించలేకపోవడం పార్టీలో క్రమశిక్షణను కాపాడలేకపోవడం వలన, గత పోరాటాన్ని గూర్చిన అభిప్రాయ భేదాలు ఇంకా తీవ్రమై, పార్టీ పరిస్థితి ఇంకా చెడిపోయింది. కనుకనే నూతన పరిస్థితుల కనుగుణ్యమైన నినాదాలను, ఎత్తుగడలను రూపొందించి, పార్టీలో ఐకమత్యం సాధించి ప్రజా వుద్యమాన్ని నూతన పునాదులపై పునర్నిర్మించి, అభివృద్ధినిరోధక వర్గాలదాడిని త్రిప్పికొట్టాల్సిన ప్రధాన బాధ్యత తెలంగాణాలో నేటికీ మన పార్టీ ముందు నిల్చివుంది.

ఈ సందర్భంలో గమనించాల్సిన మరొక ముఖ్యమైన విషయమేమనగా నేడు భారతదేశమంతటా నానాటికీ తీవ్రమౌతున్న ఆర్థికసంక్షోభం, గత రెండున్నర సంవత్సరాల కాంగ్రెసు దుష్పరిపాలనవల్ల తెలంగాణాలోని ప్రజల పరిస్థితులు

దుర్భరమయ్యాయి. దీని పర్యవసానంగా ప్రజల నిత్యజీవితానికి సంబంధించిన ప్రధాన సమస్యలనేకం వారిముందుకు వచ్చాయి. ఈ పరిస్థితుల్లో, ఎన్నికలతర్వాత ఏర్పడిన నూతన పరిస్థితుల కనుగుణ్యమైన ఎత్తుగడలు, నినాదాలద్వారా అభివృద్ధినిరోధక వర్గాల దాడిని తిప్పికొట్టాల్సిన బాధ్యతను మనం నిర్వహించాల్సి వుందని పార్టీసభ్యులు జ్ఞాపకముంచుకోవాలి.

## తెలంగాణాలో నేటి ఆర్థిక రాజకీయ పరిస్థితులు

గత రెండున్నరసంవత్సరాల కాంగ్రెసు పాలనఫలితంగా ప్రజల ఆర్థిక పరిస్థితులు మరింత చెడినవేగాని బాగుపడలేదు. భారతదేశం మొత్తంమీద అలుముకుంటున్న ఆర్థిక సంక్షోభానికి తెలంగాణా ప్రజలు కూడా గురవుతున్నారు. హైద్రాబాదు ప్రభుత్వం ఈ ఆర్థిక సంక్షోభపు దుష్ఫలితాలనుండి ప్రజలను కాపాడుటకు మారుగా ప్రజా వ్యతిరేక పాలసీద్వారా వారి జీవితాలను మరింత దుర్భరం చేస్తున్నది.

భారతదేశ ఆర్థిక విధానము ఇంకా ప్రధానంగా విదేశ గుత్తవ్యాపారస్థుల ఫ్యూడల్ భూస్వాముల పిడికిలిలో నుండడం వల్ల ఇక్కడి స్థానిక పెట్టుబడిదారులు విదేశీ గుత్తవ్యాపారస్తులతో పోటీలో నిలువలేకపోతున్నారు. దీనిమూలంగా దేశంలోని వ్యాపారం రోజురోజుకు సన్నగిలడం, ప్రజల కొనుగోలు శక్తి పడిపోవడం గృహపరిశ్రమలు దెబ్బతిని పోవడం, తద్వారా నిరుద్యోగం పెచ్చుపెరిగిపోవడం జరుగుతున్నది. దేశవ్యాపితంగా తీవ్రమవుతున్న ఈ ఆర్థిక సంక్షోభమువల్ల హైద్రాబాదు సంస్థానములో గూడా దీని దుష్టఫలితాలు స్పష్టంగా కనబడుతున్నవి. రేషనలైజేషన్ పనినుండి తొలగింపువల్ల

శ్రీ వేమన గ్రంథాలయము

వెనుకబడ్డ పరిశ్రమలు మూతబడిపోవడం, గృహపరిశ్రమలు దెబ్బ దినడం మూలంగా భూమిపై భారము పెరగడం, మరియు లక్షలమంది కార్మికులు, శ్రమజీవులు నిరుద్యోగరాక్షసికి గురి అవడం జరుగుతున్నది.

హైద్రాబాదురాష్ట్రములో నిరుద్యోగమింత తీవ్రంగా నుండుటకు హైద్రాబాదు రాష్ట్రప్రభుత్వపు ప్రత్యేక బాధ్యత కూడా వుంది. గతంలో హైద్రాబాదు ప్రభుత్వం పరిశ్రమల సహాయనిధి (ఇండస్ట్రియల్ ట్రస్టుఫండు) ద్వారా ఇతర పెట్టుబడిదారులతోపాటు పెట్టుబడులుపెట్టి, బట్టలమిల్లులు, కాగితపుమిల్లు, బొగ్గుగనులు మొదలయిన ఆధునిక పరిశ్రమల అభివృద్ధిని ప్రోత్సహించుతూ వచ్చింది. నేటి కాంగ్రెసు ప్రభుత్వం హైద్రాబాదురాష్ట్రంలో నూతన పరిశ్రమలను అభివృద్ధిచేయుటకు తోడ్పడకపోగా ఉన్న పరిశ్రమలనుండి తన పెట్టుబడులను ఉపసంహరించుకుంటున్నది. పరిశ్రమల మేనేజిమెంటులోని అవకతవకలను ఎదిరించ నిరాకరిస్తున్నది. బాగానడుస్తున్న సిర్పూరు కాగితం, కృత్రిమపట్టుమిల్లులను, బిర్లా లాంటి గుత్త పెట్టుబటిదార్లకు స్వాధీనం చేసింది. దీనికితోడుగా ఆర్థిక మాంద్యం తీవ్రతవల్ల అనేక ఆయిలుమిల్లులు, దూదిమిల్లుల లాంటి చిన్న ఫ్యాక్టరీలు మూతబడటం, ధరల ఒడుదుడుకులతో సామాన్య వర్తకులు దివాళా తీయడం జరుగుతున్నది.

నిజాం నిరంకుశత్వం సాగుతున్న రోజుల్లో, ప్రభుత్వ డిపార్టుమెంటులలో అనవసరముగావున్న సిబ్బందిని తగ్గించటం; నిజాం మిలిటరీని పూర్తిగా రద్దుచేయటం, పోలీసు దళాల్లో స్థానికులకు చోటివ్వకుండా బయటివాళ్ళను నింపటం, ప్రభుత్వ

ద్యోగాల్లోనుంచి తీసివేసిన అదనపు ఉద్యోగస్థులకు వేరే వృత్తులు చూపకపోవడం మొదలయిన చర్యలు కాంగ్రెసు ప్రభుత్వం చేస్తూవచ్చింది. జాగీరులు, సర్ఫెఖాసు రద్దు మూలంగా వాటిలోని సిబ్బంది దాదాపు అంతా నిరుద్యోగు లయ్యారు. ఈ విధంగా నిజాం నిరంకుశ ఫ్యూడల్ వ్యవస్థలో కాంగ్రెసు ప్రభుత్వం తీసుకువచ్చిన మార్పుల ఫలితంగా వేలాదిమంది నిరుద్యోగులయ్యారు. వారికి మరేవృత్తి చూపక పోవటంవలన, ఆర్థిక సంక్షోభం ఫలితంగా ఇదివరకే నిరుద్యోగు లుగా నున్నవారికి వీరుగూడా తోడై హైద్రాబాదురాష్ట్రంలో నిరుద్యోగ సమస్య మరింత తీవ్రమైంది.

ఆర్థిక సంక్షోభంలో ప్రజల కొనుగోలుశక్తి పడిపోవుట వలన చేనేత పరిశ్రమ పూర్తిగా దెబ్బతినిపోయి, లక్షలాది చేనేత పారిశ్రామికులు నిరుద్యోగులై అలమటించి పోతున్నప్ప టికీ, కాంగ్రెసు ప్రభుత్వం ఏవో ఉపశమనపు కార్యక్రమాలతో కాలం గడుపుతూవుంది. చేనేత పరిశ్రమతోపాటు, ఇతర చేతివృత్తులు కూడా దెబ్బతింటున్నాయి.

తెలంగాణానుంచి బొంబాయి, షోలాపూరు మొదలైన పట్టణాలలో బట్టల మిల్లులలోను, గృహనిర్మాణ పరిశ్రమలోను పనిజేయడానికి వలసవెళ్ళిన వేలాది కార్మికులు నిరుద్యోగులై తిరిగి రావటంతో ఇప్పటికే నిరుద్యోగులుగా వున్నవారి సంఖ్య యింకా పెరిగిపోతూవుంది.

పట్టణాలలోను, పరిశ్రమల్లోను నిరుద్యోగులైనవారిలో కొంతసంఖ్య గ్రామాలకు పోవటంతో యిప్పటికే భూమిమీద వున్న వొత్తిడి యింకాతీవ్రమైంది. కాంగ్రెసు ప్రభుత్వం

భూసంస్కరణలయెడల అనుసరించుతున్న పాలసీలవల్ల గ్రామ ప్రజలపరిస్థితి దుర్భరమౌతూవుంది. తెలంగాణా ప్రజలు తమ వీరోచిత పోరాటంద్వారా సాధించుకున్న విజయాలను వమ్ముజేస్తూ, భూస్వాముల ప్రయోజనాల రక్షణకు పూనుకుంది 1950 కౌలుదారీ చట్టంలో అంగీకరించిన రైతుల కౌలు హక్కులను సంకుచితపరచడానికి ఈ కౌలుదారీ చట్టంలో మార్పులను తీసికొని వచ్చింది. దీన్నుపయోగించుకొని, భూస్వాములు కౌలుభూములనుండి రైతులను బేదఖల్ చేయడానికి, భూములు అమ్ముకొని లక్షలాది రూపాయలు పోగుజేసుకోడానికి పూర్తిసహాయం చేస్తూవుంది. అంతేగాక వ్యవసాయ కూలీలు, పేదరైతులు పోరాటకాలంనుండి సాగుచేస్తున్న లావునీ భూములమీద విపరీతమైన తావాసులు విధించడానికి, వాటినుండి బేదఖల్ ఛేయడానికి పూనుకున్నది. వెట్టిచాకిరీ నిషేధిస్తూ చట్టంవున్నా, యింకను గ్రామాల్లో ప్రభుత్వోద్యోగులు, పటేలు పట్వారీలు, పనిబాటలు వారితో వెట్టిచాకిరీ చేయించుకుంటూనే వున్నారు. రైతులు పండించే వేరుసెనగ, ఆముదాలు, పొగాకు మొదలైనపంటల ధరలు పడిపోయి, దివాళాలు తీసే ప్రమాదపరిస్థితు లేర్పడినప్పటికీ కనీస గిట్టుబాటు ధరలు నిర్ణయించి రైతులను కాపాడుటకు ప్రభుత్వం పూనుకొనుట లేదు. అంతేగాక, ప్రజలమీద యిప్పటికే భారంగావున్న పన్నులను పెంచటానికి, కొత్తపన్నులు వేయడానికి పూనుకున్నది. పోరాటకాలంనుండి జాగీరులలోను, దివానీ ఇలాఖాలలోను వున్న శిస్తు బకాయీలు, తక్కానీ అప్పుల వసూళ్ళకు రైతుల ఆస్తులనుకూడా జప్తులు చేస్తూవుంది. ఈపరిస్థితుల్లో గ్రామాల్లో

తప్పదొరకటమే కష్టంగావుంది. విపరీత వడ్డీలమీద సొమ్ములు, అదితరఆస్తులు కుదువబెట్టినవారికే షాహుకారులు అప్పులు యిస్తున్నారు. ఈ పరిస్థితులమూలంగా రైతులు కొత్తహక్కులు సాధించుకోవటంమాట అటుంచి, ఉన్న భూములే ఊడిపోయే పరిస్థితివచ్చింది.

వ్యవసాయకూలీల పరిస్థితి రైతులకన్నా యింకా దుర్భరమైంది. పట్టణాలలోని నిరుద్యోగులు కొందరు భుక్తికోసం గ్రామాలకు పోవుటవలన వ్యవసాయ కూలీలసంఖ్య యింకా పెరిగింది. కూలీరేట్లు మునుపటికన్నా పడిపోయాయి. వ్యవసాయ కూలీలకు పనిదొరకటం మునుపటికన్న కష్టమైపోయింది. దీనికి తోడు లావునీ భూములనుండి ప్రభుత్వం బేదఖల్ చేయడానికి పూనుకున్నందున వీరి పరిస్థితి యింకా అధ్వాన్నమైనది.

పోరాటకాలంలో ప్రభుత్వం అమలు జరిపిన నిర్బంధ విధానంవల్ల కోయ, గోండు మొదలైన అటవీతెగల ప్రజలు చాల నష్టపడ్డారు. దీనికితోడు ఆర్థిక సంక్షోభం, నేటి ప్రభుత్వ విధానంవల్ల వారి పరిస్థితి దుర్భరమైంది. ప్రభుత్వం నూతన అభివృద్ధికర వ్యవసాయపద్ధతులు అనుసరించటానికి సహాయంచేయకుండా, పోడు వ్యవసాయాన్ని ఆచరణలో నిషేధించింది. ఆర్థిక సంక్షోభంవల్ల తునికాకు ధరపడపోవటం, కలపకు కొట్టుకూలి తగ్గిపోవడం గూడ జరిగింది. ఈ కారణంగా ఈ తెగల పరిస్థితి యితర గ్రామీణ ప్రజలకన్న యింకా అధ్వాన్నంగా తయారైంది.

ఈ పైన జెప్పిన కారణాలవల్ల తెలంగాణాలో వ్యవసాయ సంక్షోభం తీవ్రమై రైతులు, కూలీలు, అటవీ తెగలవారు తమ భూములను పోగొట్టుకొని నిరుపేదలయ్యే పరిస్థితిఏర్పడింది.

ఈ పరిస్థితుల్లో విద్యార్థులకు విద్యాభ్యాసాని కయ్యే ఖర్చులు కూడా పెరిగినవి. విద్యార్థులు చదువుకొనుటకు స్కూళ్ళలో, కాలేజీలలో సీట్ల కొరత విపరీతంగా యేర్పడింది. ఇది యిలావుండగా, ప్రభుత్వం కాలేజీల్లో గూడా మాతృభాషలో విద్యాబోధ జరిపే యేర్పాట్లు చేయకుండా, ఉస్మానియా యూనివర్సిటీని భారత ప్రభుత్వం తీసికొని, హిందీ విశ్వవిద్యాలయముగా మార్చి, తెనుగు, మహారాష్ట్ర, కన్నడ భాషల అభివృద్ధిని అరికట్టడానికి భారత ప్రభుత్వానికి తోడ్పడుతుంది.

పైన వివరించబడిన కాంగ్రెసు ప్రభుత్వపు అభివృద్ధి నిరోధక పాలసీలకు వ్యతిరేకంగా గత రెండున్నర సంవత్సరాల నుండి తెలంగాణాలోని కార్మికకర్షకులు, విద్యార్థి, వ్యాపారస్థులు పోరాడుతూవచ్చారు. నిరుద్యోగము, పనిభారము, పనుల నుండి తొలగింపుకు వ్యతిరేకంగా తమ జీవిత పరిస్థితులు బాగుపరచుకోవడానికై ట్రేడ్ యూనియన్ హక్కులకొరకు, మరియు రిట్రెంచ్‌మెంట్‌కు వ్యతిరేకంగా బొగ్గుగనుల కార్మికులు, ఆర్. టి. డి. కార్మికులు, సిర్‌పూర్ కార్మికులు, బట్టలమిల్లు కార్మికులు, పెద్ద పోరాటాలు సాగించారు. పన్నుల హెచ్చింపుకు వ్యతిరేకంగా వ్యాపారస్థులు కూడా తమ ఆందోళన సాగించారు.

రైతాంగం తమ కౌలు భూముల రక్షణకై బేదఖలీలకు వ్యతిరేకంగా తెలంగాణా వ్యాపితంగా గొప్ప ఆందోళన సాగిం

చింది. హరిజనులు, వ్యవసాయ కూలీలు లావునీ భూముల పట్టాలకొరకు పోరాడుతూ వచ్చారు.

ప్రజలు తమ జీవిత సమస్యల కొరకు, ప్రజాస్వామ్య హక్కులకొరకు పోరాడుతూంటే కాంగ్రెసు ప్రభుత్వం ఈ ప్రజా పోరాటాలను దెబ్బతీయడానికి, విచ్ఛిన్నము జేయడానికి విశ్వ ప్రయత్నాలు జేస్తున్నది. ప్రజాసంఘాల కార్యకర్తలను ముఖ్యంగా తమ న్యాయమైన హక్కులకై పోరాడుతున్న రైతుల నెందరినో అరెస్టుచేసి జైళ్ళలో నిర్బంధిస్తున్నది. రకరకాల కేసులలో ఇరికించి కార్యకర్తలను, రైతులను కోర్టుల చుట్టూ త్రిప్పుతూ విసుగెత్తించే ప్రయత్నం చేస్తున్నది. అంతేగాకుండా భూస్వాములు కొన్ని ప్రాంతాలలో ప్రజా సేవకులపై పోలీసుల సహాయముతో గూండాచర్యలకు పూనుకుంటున్నారు.

పైన వివరించబడిన కాంగ్రెసు ప్రభుత్వపు అభివృద్ధినిరోధక పాలసీలవల్ల కాంగ్రెసు ప్రభుత్వంయెడల ప్రజల్లో అసంతృప్తి తీవ్రమౌతూవున్నది. కాంగ్రెసు ప్రభుత్వం ప్రజలనుండి ఇంకా దూరమౌతూవున్నది. దీని ప్రభావం కాంగ్రెసు సంస్థ మీదపడి, కాంగ్రెసులో అదివరకేవున్న పదవుల కీచులాటలు, ముఠాతత్వాలు యింకా తీవ్రమైనవి. ప్రజల ముందున్న వివిధ సమస్యలమీద కాంగ్రెసులోకూడా చీలికలు బయలుదేరినవి. 1950 కౌలుదారీచట్టం సవరణల సందర్భంలో కాంగ్రెసుఅసెంబ్లీ పార్టీలో తీవ్రమైన విభేదాలు పొడసూపి, బయట బలవత్తరమైన ప్రజాసమీకరణ లేకపోవుటవలన తాత్కాలికంగా సమసిపోయినది. అలాగే విశాలాంధ్ర సమస్యమీదకూడా కాంగ్రెసులో తీవ్రమైన అభిప్రాయభేదాలు రేకెత్తినవి. కాంగ్రెసు

మంత్రులు లేవదీసిన రెండు తెలుగు రాష్ట్రాల నినాదానికి కాంగ్రెసు సంస్థలోనే మెజారిటీ వ్యతిరేకంగా వుంది. ఇదే విధంగా నేడు ప్రజలముందున్న అనేక ప్రధాన సమస్యలమీద కాంగ్రెసు సంస్థలోనే విభేదాలు బయలుదేరుతాయి. ఈ పరిస్థితుల కారణంగా కాంగ్రెసు ప్రభుత్వం నేటివరకూ దినదిన గండంగా గడుపుకుంటూ వచ్చింది. గతంలో కొన్ని సందర్భాలలో కాంగ్రెసు ప్రభుత్వం పడిపోయే పరిస్థితులు కలిగినవి. అయితే బయట ప్రజా వుద్యమం బలవత్తరముగా లేకపోవుట వలన కాంగ్రెసు ప్రభుత్వం తన వునికని తాత్కాలికంగా కాపాడుకోగలిగింది. అంతేగాని కాంగ్రెసు ప్రభుత్వపు పునాది నేటికీ బలహీనంగానేవుంది. ఈ ఆర్థిక సంక్షోభపు పరిస్థితులలో కాంగ్రెసు సంస్థలో చీలికలు రావడం, తత్ఫలితంగా కాంగ్రెసు ప్రభుత్వం వూగిపోయే పరిస్థితులు రావడం జరుగుతుంది.

కాంగ్రెసువలెనే ప్రజాసోషలిస్టుపార్టీలో కూడా, నేడు ప్రజల నెదుర్కొన్న ప్రధాన సమస్యలమీద చీలికలు బయలు దేరినవి. విశాలాంధ్ర సమస్యవల్ల అందులో ఏర్పడిన తీవ్రమైన విభేదాలు ఇందుకు తార్కాణం. కాంగ్రెసు, ప్రజా-సోషలిస్టు పార్టీల్లో కొందరు కొన్ని సమస్యలమీద కలిసివస్తున్నారు. ఏ పార్టీకీ చెందని అభివృద్ధికాముకులు తెలంగాణా అంతటా ముందుకువస్తున్నారు.

తెలంగాణాలోనేయున్న ఆర్థిక రాజకీయ పరిస్థితులలో ఈ క్రింది ప్రధాన కర్తవ్యాలు ప్రజలముందుకు వస్తున్నాయి. ఈ ప్రధాన కర్తవ్యాలమీద పార్టీనాయకత్వంవహించి అసెంబ్లీ లోపల, బయట తీవ్రమైన నిరంతర ఆందోళనసాగించాలి.

తద్వారా ప్రజలను, ప్రజాస్వామ్యవాదులనందరిని సమీకరించి, ఐక్యసంఘటన నిర్మించి, ప్రస్తుత కాంగ్రెసు ప్రభుత్వము స్థానే ఐక్య ప్రజాస్వామ్య ప్రభుత్వస్థాపన లక్ష్యంవైపు కొంపోవలసిన బాధ్యత నేడు తెలంగాణాలో కమ్యూనిస్టుపార్టీపై నున్నది.

1. ప్రస్తుతంవున్న పరిశ్రమల రక్షణ, చేతివృత్తుల రక్షణ, నూతన పరిశ్రమల ఏర్పాటు, మొదలయినవానిద్వారా నిరుద్యోగ సమస్యలను పరిష్కారము చేయాలి.

2. బేదఖళ్ళ నిలుపుదల; ప్రభుత్వభూములు; గరిష్ఠ పరిమితికి మించివున్న భూస్వాముల భూములను వ్యవసాయ కూలీలకు, పేదరైతులకు వుచితంగా యివ్వడం; అడవి తెగల వారికి వ్యవసాయానికి తగినంత భూమి యిచ్చి, వారు నూతన అభివృద్ధికర వ్యవసాయ పద్ధతులను అనుసరించేందుకు సహాయం చేయడం, రైతులమీద పన్నులు తగ్గించడం, రైతుల అప్పుల మీద మారటోరియం పెట్టడం, రైతుల పంటకు న్యాయమైన కనీస ధరలు నిర్ణయించడం, మేజర్, మైనర్ ఇర్రిగేషన్ ప్రాజెక్టులను నిర్మించడము, వ్యవసాయకూలీలకు కనీసకూలీ, యితర హక్కులను కల్పించడం,వ్యవసాయ సంస్కరణలద్వారా రైతులను, వ్యవసాయ కూలీలను ఆర్థిక సంక్షోభాన్నుండి కాపాడాలి.

3. హైద్రాబాదురాష్ట్రాన్ని విభజించి విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర, ఐక్య కర్ణాటకరాష్ట్రాల నేర్పరచాలి.

4. ఎక్కువ స్కూళ్ళు, కాలేజీలు తెరవటం, కాలేజీల్లో గూడా మాతృభాషలను బోధనా భాషలుగా చేయడం ద్వారాను ప్రస్తుతమున్న ఫీజులను తగ్గించి, అందరికీ అందు

బాటులో వుండే విధంగా విద్యాభివృద్ధి చేయాలి. ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని హిందీ విశ్వవిద్యాలయంగా మార్చడాన్ని నిరోధించాలి.

5. వివిధరూపాలలో ప్రజాఉద్యమాలమీద సాగుతున్న నిర్బంధవిధానాన్ని అరికట్టాలి. పౌరసత్వాల రక్షణకు పూనుకోవాలి.

6. రాజకీయ విభేదాలను పాటించకుండా ప్రపంచ శాంతిని కాంక్షించే అందరినీ ఐక్యంజేసి, బలవత్తరమైన శాంతి ఉద్యమాన్ని నిర్మించాలి.

కాంగ్రెసు ప్రభుత్వం ప్రధాన సమస్యలమీద ప్రజలలో బట్టబయలు అయ్యేకొద్ది తన ఉనికిని కాపాడుకోవడానికి యీ క్రింది ఎత్తుగడలను ఇంకా ఎక్కువగా ప్రయోగించుతున్నది. అందుచేత మనంగూడ పైన జెప్పబడిన ప్రధాన సమస్యలమీద కేంద్రీకరించుతూ ఐక్యప్రజాసంఘాలను నిర్మించడంద్వారానే కాంగ్రెసుప్రభుత్వపు నూతన ఎత్తుగడలను భగ్నం చేయగలమని గ్రహించాలి.

## కాంగ్రెసు ప్రభుత్వ - అభివృద్ధినిరోధక వర్గాల ఎత్తుగడలు

కాంగ్రెసు ప్రభుత్వం, భూస్వాముల క్రొత్త ఎత్తుగడలు 1952 ఎన్నికలతో సమగ్రరూపం ధరించాయి. ఎన్నికలముందే ప్రజలు జరిపిన వీరోచితపోరాటం ఫలితంగా, కాంగ్రెసు ప్రభుత్వం జాగీర్దారీల రద్దు, నిర్బంధవెట్టి రద్దు, కౌలుదారులకు పరిమిత రక్షణ కలిగించే శాసనాలద్వారా వ్యవసాయ సంస్కరణలు ప్రవేశపెట్టింది.

ఈ వ్యవసాయ సంస్కరణలవల్ల భూస్వాములు భూసంబంధాల్లో మౌలికమైన మార్పులు రావడం జరుగదు. పూర్వం సాగిన నగ్నమైన భూస్వాములు దోపిడీ విధానంలో కొన్ని మార్పులు తేబడినవి. వీటివల్ల గ్రామసీమల్లో పెట్టుబడిదారీ సంబంధాలు కొంతవరకు అభివృద్ధి అవడానికి, భూస్వాములు భూస్వాములు కొంతవరకు పెట్టుబడిదారీ పద్ధతులు అనుసరించడానికీ, ఈ సంస్కరణలు ప్రోత్సహించుతున్నవి.

అంతేగాక కొంతవరకు రైతుల హక్కులను ఒకవైపున అంగీకరించుతూనే, వీటిని ఆచరణలో సాధ్యమైనంత సంకుచిత పరచడానికి ఈ సంస్కరణల్లో అవకాశాలు కల్పింపబడినవి. అందుచేత రైతాంగంలో భ్రమలుగొల్పడానికి, వారిలో చీలికలు పెట్టడానికి ఈ సంస్కరణలు వీలుకల్గిస్తున్నవి. ధనికరైతులకు, కొంతవరకు మధ్యతరగతి రైతులకు భూములు కొనుక్కునే అవకాశాలు కల్పించి, వీరిని తమ ప్రక్కన చేర్చుకొనుటకు గూడ ఈ సంస్కరణ లుద్దేశించబడినవి.

ఐక్య రైతు ఉద్యమ నిర్మాణం, రైతుల సమీకరణ, పోరాటాలు సాగించినప్పుడే ఈ సంస్కరణాలలోని ప్రజా విజయాల ఫలితాలను కొంతవరకైనా పొందటానికి వీలుపడుతుంది.

నైజాం కాలంలో ప్రజల మాతృభాషలను అణచివేసి, ఉర్దూను నిర్బంధంగా ప్రజలపైన రుద్దే విధానాన్ని రద్దుచేసి, స్కూలుఫైనలువరకు మాతృభాషలో విద్యాబోధన ప్రవేశపెట్టింది.

ఎన్నికల తర్వాత మునిసిపల్ కౌన్సిల్సు, పంచాయతీ బోర్డులు, కమ్యూనిటీ ప్రాజెక్టులు మొదలగునవికూడా ప్రవేశ పెట్టింది.

కాంగ్రెసు ప్రభుత్వం, భూస్వాములు సాగించే ఎత్తుగడలను క్రిందివిధంగా చెప్పవచ్చు:

1. గ్రామీణ ప్రజలలో రైతులకు – కూలీలకు మధ్య, రైతులలో – రైతులకుమధ్య, భూమి సమస్యల మీాద కలతలను రెచ్చగొట్టి చీలికలు బెట్టడం చేస్తున్నారు. బంచరాయి, పోరంబోకులమీాద ఒకచోట గొల్లలను, రైతులను హరిజనులపైకి, మరొకచోట హరిజనులను ఇతర రైతులమీాదికి ఉసిగొల్పడం చేస్తూ, ఏదో ఒక పక్షాన్ని గుప్పిటిలో పెట్టుకో ప్రయత్నించుచున్నారు. ఈ బలాన్ని ఉపయోగించుకొనియో, లేక భూమిలేని హరిజనులకు ఏదో ఒకవిధమైన ఆశలు కల్పించియో కౌలు భూములనుండి రైతులను బేదఖల్ చేయడం పరిపాటి అయింది. ఈవిధంగా పోరాటకాలంలో గ్రామీణప్రజలలోవచ్చిన ఐక్యతను విచ్ఛిన్నంచేసి, తమకు బలాన్ని చేకూర్చుకొన ప్రయత్నించుచున్నారు. తమ భూసంస్కరణల ద్వారా ధనిక రైతాంగానికి కొంతవరకు భూమికొనే అవకాశాలను కలుగజేసి, ధనిక రైతాంగాన్ని తమవైపు త్రిప్పుకొన ప్రయత్నిస్తున్నారు.

2. మునిసిపల్ కమిటీలు, పంచాయతీలు, కోఆపరేటివులు, గ్రేన్ బ్యాంకులు, సోషల్ సర్వీసు డిపార్టుమెంటు, జాతీయాభివృద్ధి బోర్డులు మొదలైన అధికార పూర్వక సంస్థలను చేతులలో బెట్టుకొని, ప్రజలను మభ్యపెట్టి, తమకు బలం చేకూర్చుకుంటున్నారు.

3. నూతన స్కూళ్ళు, కాలేజీలు, ఆసుపత్రులు, ఇర్రిగేషన్ ప్రాజెక్టులు మొదలైన సమస్యలు తీసుకొంటూ ప్రజలు కొద్దో గొప్పో సాధించినవాటిని తమ ప్రభుత్వమే చేసిందని ప్రజలలో భ్రమలు గొల్పుతున్నారు.

4. ఐ. ఎన్. టి. యు. సి. కర్షక సమితిలాంటి పోటీ సంఘాలు పెట్టడం, కులసంఘాలను ప్రోత్సహించి, కులతత్వాలను రెచ్చగొట్టడంలాంటి విచ్ఛిన్నకర ప్రయత్నాలు చేస్తున్నారు.

5. గతంలో నగ్నంగా ఉపయోగించిన నిర్బంధ విధానం స్థానంలో గూండాదళాలను నిర్మాణంజేసి, ప్రజల మీదికి ఉసిగొల్పడం, వారికి మద్దతుగా పోలీసు బలగాలను పంపడం, ప్రజానాయకులమీద కేసులమీద కేసులు నడుపుతూ, జైళ్ళలో నిర్బంధించి వుంచడం సాగిస్తున్నారు. ఈ నిర్బంధ విధానాన్ని సమర్థించుకోవడానికి కమ్యూనిస్టుపార్టీ సాయుధ పోరాటముకు సన్నాహాలు చేస్తుందనే దుష్ప్రచారం పెద్దయెత్తున సాగిస్తున్నారు.

6. వివిధ రూపాలలో అభివృద్ధి నిరోధక సిద్ధాంతలను విరివిగా ప్రచారం జేస్తున్నారు. దీనికొరకు భూస్వాముల దయాదాక్షిణ్యాలలో భూసమస్య పరిష్కారం సాధ్యమవుతుందని భ్రమలు కొల్పటానికి భూదాన యజ్ఞంలాంటివి కొనసాగిస్తున్నారు.

## మన పార్టీ అనుసరించవలసిన విధానం

శత్రువర్గాల పై ఎత్తుగడలను భగ్నంజేసి వారి దాడిని త్రిప్పికొట్టాలంటే మన పోరాటకాలంనాటి యెత్తుగడలను,

పద్ధతులను పూర్తిగా మార్చవలసిన అవసరముంది. ఆ రోజుల్లో సూటిగా ఏదో భూమిసమస్యను తీసుకొని, ఒక నిరంకుశ భూస్వామిమీద గ్రామప్రజలందరినీ సమీకరించే వాళ్ళం. భూస్వాములు నగ్నమైన నిరంకుశ పద్ధతులు సాగిస్తూ ధనిక రైతులు మొదలు వ్యవసాయ కూలీలవరకు అందరనూ పీడించు తున్న ఆ రోజుల్లో అది సాధ్యమైంది. అందువల్ల మన పోరాటం కూడా విజయవంతంగా ముందుకు నడిచింది. కాని నైజాం నిరంకుశ పాలన స్థానంలో కాంగ్రెసు పాలన రావడం, యితర రాష్ట్రాలలో వలెనే ప్రజాస్వామ్య సంస్థలను నెలకొల్పడం, వివిధరకాల స్కీములను ప్రవేశపెట్టడం, తెలంగాణా పోరాటం వలన భూస్వామ్యవర్గాలుకూడా పాతనిరంకుశ విధానం సాగదని తెలిసికొని పైన వివరించబడిన సున్నిత పద్ధతులను అవలం బించడం జరుగుచున్న ఈ రోజుల్లో, మన పోరాటకాలపునాటి పద్ధతులు ఉపకరించవు.

ఈ నూతన పరిస్థితుల కారణంగా వివిధ వర్గాల్లో వారి సమస్యల స్వరూపంలో వచ్చిన మార్పుల దృష్టిలో, మనం భూస్వాములకు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజల ఐక్యతను నూతన రూపంలో నిర్మించాలె. ఇందులకై భూమి సమస్యను అది తీసుకున్న నూతన రూపాల్లో పరిష్కరించుటకై ప్రధానంగా కేంద్రీకరిస్తూనే, దీనితోపాటు రైతాంగాన్ని ఎదుర్కొంటున్న వివిధ సమస్యలను తీసుకొని పనిచేయాలి. తద్వారా రైతాంగ ఐక్యతను నెలకొల్పాలి. అంతేగాక వ్యవసాయ కూలీల సమస్యను తీసికొని పనిచేస్తూ, రైతుల కూలీల ఐక్యతద్వారానే ఇద్దరి ప్రయోజనాలు ఎలా రక్షింపబడతాయో ప్రచారంచేసి,

రైతు-కూలీ ఐక్యతను నెలకొల్పాలి. ఈ కార్యకలాపా లన్నిటి లోనూ తెలంగాణా పోరాటంద్వారా మనం సాధించిన విజ యాలను ప్రాతిపదికగా తీసుకొని పనిచేయాలి.

పైజెప్పిన సర్వతోముఖమైన నిరంతర కార్యాచరణ ద్వారా, విస్తృతమైన పునాదిగలిగిన బలమైన ప్రజాసంఘా లను నిర్మించాలి. ప్రస్తుతం ప్రజాసంఘాల పలుకుబడికి వాటి నిర్మాణానికి ఉన్న పెద్ద అంతరాన్ని తొలగించాలి. చాల ఎక్కువ సంఖ్యలో సభ్యులను చేర్చాలి. ప్రాథమిక సంఘాలు మొదలు పై కమిటీవరకు చక్కగా పనిచేయించాలి. ప్రజా సంఘాల స్వతంత్రప్రతిపత్తిని కాపాడుతూ వాటిని ప్రజాస్వామ్య పద్ధతులమీద పనిచేయించాలి. అప్పుడే మనం అభివృద్ధి నిరోధకవర్గాల ఆటకట్టించి, ప్రజోద్యమాన్ని ముందుకు తీసుకు పోగలుగుతాం.

అయితే ఈ సందర్భంలో మనం ఒక ప్రధాన విష యాన్ని ఎల్లప్పుడు గుర్తుంచుకోవలసి వుంటుంది. ప్రజాతంత్ర ఉద్యమానికి పట్టణాలలో కార్మికులు, ఇతర పేదలు, గ్రామా లలో వ్యవసాయకూలీలు, పేదరైతాంగము పునాదివర్గాలని గుర్తించాలి. అందుచే ఈ కార్యకలాపాలు సాగించేటప్పుడు, ఈపునాది వర్గాలను అగ్రగాములుగా ముందుకు తీసుకురావలసిన అవసరముంది. ప్రతి సమస్యమీద సాధ్యమైనంత విశాల ప్రజా నీకాన్ని సమీకరించాలి. అప్పుడే ఆవుద్యమం బలవత్తరంగాను, ఊగిసలాడే మధ్యతరగతివారిని, పైవర్గాల రైతులను కలుపు కొని వచ్చేదిగాను వుంటుంది. లేనియెడల ప్రజాస్వామ్యపు ఉద్యమ నాయకత్వం పైవర్గాల చేతుల్లో వుండి, పునాదిలేని

భవనంవలె తయారై క్లిష్టపరిస్థితుల్లో చేయిజారిపోయే ప్రమాదం వుంది.

## సర్వతోముఖమైన నిరంతర ప్రజాకార్యాచరణ

1. తెలంగాణా పోరాటం ఆరంభమైనప్పటినుండి మనం భూమి సమస్యమీదనే కేంద్రీకరించి, వ్యవసాయకూలీలను, రైతాంగాన్ని సమీకరించి కలుపుకవచ్చాము. కూలీ సమస్యలు అక్కడక్కడ తీసుకున్నా, వీరి సందర్భంలోకూడా భూమి సమస్యలమీదే కేంద్రీకరించాము. కూలీలను, రైతులందరినీ. పోరాటరోజుల్లో ఆంధ్రమహాసభలోనే సమీకరించాము. ఎన్నికల తర్వాత కూలీ రైతులందరినీ, ఏవో కొద్దిచోట్లమినహా, రైతుసంఘంలోనే చేర్చుతూ వచ్చాము. అయితే నేటి పరిస్థితులలో పైవిధంగా వ్యవసాయ కూలీలను బలవత్తరమైన ఉద్యమంలో సమీకరించడం సాధ్యంకాదు. ఎందువల్లనంటే భూసమస్యను పూర్తిగా పరిష్కరించి, వ్యవసాయ కూలీలకు గూడా తక్షణం జీవనోపాధి కలిగించగలిగినంత భూమిని యివ్వగలిగిన శక్తి ప్రజాఉద్యమానికి లేదు. అందుచేత లావుణీ భూములను వ్యవసాయ కూలీలు, పేద రైతాంగానికి యివ్వాలనే నినాదంతోపాటు, కూలి సమస్యనుకూడా తీసుకున్నప్పుడే వారికి తక్షణ సహాయం దొరుకుతుంది. మనం కూలి సమస్యను తీసుకోక పోవడంవల్ల వారిలోవున్న భూకాంక్షను ఉపయోగించుకొని రైతులకు, కూలీలకు మధ్య చీలికలు పెట్టడానికి భూస్వాములకు అవకాశం దొరుకుతూవుంది. అందుచే వ్యవసాయ కూలీలు తగు సంఖ్యలోవున్న ప్రాంతాలన్నిటిలోనూ ప్రత్యేక వ్యవసాయ కూలీసంఘాలను పెట్టి, వారిని కూలీ,

పాలేరు సమస్యలు, ప్రభుత్వభూముల సమస్యలు, వెట్టి సమస్య, ఇంష్టస్థలాలు, మంచినీటి నూతులు మొదలైనవాటిమీద సమీకరించాల్సిన అవసరముంది. ఈ విధంగా గ్రామాలలో రైతు కూలీలమధ్య ఐకమత్యము నూతన పద్ధతులలో సాధించి, భూస్వాములకు వ్యతిరేకంగా భూమి, కూలి మొదలైన సమస్యలమీద రైతుకూలీలను సమీకరించాల్సిన అవసరముంది. నేడు గ్రామసీమల్లో ప్రత్యేక కూలీసంఘాలను నిర్మించడం ప్రధానబాధ్యతల్లో ఒకటిగా పార్టీ మొత్తంగా తీసుకోవాలె.

ఇదే సందర్భంలో మరొక హంశాన్నికూడా మనం జ్ఞాపకముంచుకోవాలి. వ్యవసాయకూలీలలో అధిక సంఖ్య హరిజనులుగాకూడా వున్నారు. వారు ఆర్థిక దోపిడీతోపాటు అంటరానితనమనే సాంఘిక దురాచారానికికూడా బలి అవుతున్నారు. అంటరాని తనం, యితర సాంఘిక దురాచారాలు, ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పడినప్పుడే పూర్తిగా నిర్మూలన చేయడం సాధ్యమనేమాట సత్యమే. అయితే అంతవరకు ఈ సమస్యను ముట్టరాదనడం ప్రజా వుద్యమానికి హానికరం. ఆర్థిక హక్కుల సాధనతో పాటు సాంఘిక సమత్వం యేర్పడి తాముకూడా మానవులుగా చూడబడాలనే కాంక్ష హరిజనుల్లోనూ, ఇతర వెనుకబడివున్న కులాలలోనూ పైకుబికి వస్తావుంది. ఈ కాంక్షను కులపెత్తనదార్లు అవకాశంగా తీసికొని, అనేక కులసంఘాలను యేర్పరచడం, వాటిద్వారా కష్టజీవుల్లోని వర్గఐక్యతను విచ్ఛినం చేయడం జరుగుతూవుంది. ఈ కులసంఘాల్లోని స్వార్థపరులను బుట్టలో వేసుకొని తమకు బలాన్ని, చేకూర్చుకోడానికి కాంగ్రెసు

ప్రభుత్వం తీవ్రప్రయత్నాలు చేస్తావుంది. అందుచేత మనం వ్యవసాయకూలీల ఆర్థిక సమస్యలతోపాటు అంటరానితనం, సాంఘిక దౌర్జన్యాలకు వ్యతిరేకంగా తీవ్రప్రచారం చేయాలి. వాటిని మాన్పడానికి తీవ్రకృషికూడా చేయాలి.

2. రైతాంగంయొక్క వివిధరకాల భూమి సమస్యలు, రైతులు పండించే పంటలకు సక్రమమైన ధరతోపాటు రైతుల జీవితాలకు సంబంధించిన అన్ని సమస్యలను తీసుకోవాలి. ఇప్పటికే నీటిపారుదల సౌకర్యాలున్నచోట నీటి పారుదలకు సంబంధించిన సమస్యలను ఇతర ప్రాంతాలలో మేజరు, మైనరు ఇర్రిగేషన్ సమస్యలను తీసుకోవాలి. కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయాభివృద్ధిబోర్డు లున్నచోట్ల వాటిలో పాల్గొని, రైతులకు అవకాశంవున్న సౌకర్యాలను సాధించడం, అందులో జరిగే లంచగొండి విధానాలను బట్ట బయలు చేయడం సాగించాలి. టాకా, గ్రేను బ్యాంకులు, భూమి తనఖా బ్యాంకులు మొదలైన సహకార సంస్థలద్వారా రైతులమీద వర్తకులు ధరలవిషయంలో జరుపుతున్న మోసాన్ని అరికట్టడం, రైతులకు చౌకవడ్డీలమీద అప్పు లిప్పించడం సాగించాలి.

ప్రభుత్వ వ్యవసాయ డిపార్టుమెంటుద్వారా వ్యవసాయ అభివృద్ధికి చేస్తున్న సహాయాన్ని భూస్వాములు మింగివేయకుండా రైతులకే చెందేటట్లు కృషిచేయాలి. తక్కావి అప్పులు, ఎరువులు, మంచి విత్తనాలు రైతులకు సప్లయి అయ్యేలా చూడాలి. రైతులకు అవకాశమున్నంతవరకు అభివృద్ధికరమైన వ్యవసాయ పద్ధతులను అనుసరించేటందుకు వారిలో ప్రచారం చేయాలి.

ఈ బహుముఖమైన కార్యాచరణద్వారా విస్తృతమైన రైతుసంఘాన్ని నిర్మించాలి.

3. కార్మికరంగంలో ప్రభుత్వం తీసుకొచ్చిన కార్మిక శాసనాలను గురించి, అవి కార్మికులకు కలిగించే సౌకర్యాలను గురించి తక్కువ అంచనా వేయటం జరుగుచున్నది. ప్రసూతి సౌకర్యాలు, కార్మికుల నష్టపరిహారచట్టం, కనీస వేతనాల చట్టం మొదలయినవాటిని కార్మికులు అనేక దీర్ఘ పోరాటాల ద్వారా ప్రభుత్వంచేత చేయించగలిగారు. ఈ చట్టాలన్నిటిని కార్మికుల కుపయోగపడునట్లును, ప్రభుత్వం, యజమానులు మోసం చేయకుండాను కార్మికసంఘాలు చూడాలె.

అలాగే ప్రభుత్వం యొక్క 'కార్మిక సంక్షేమ నిధి, (లేబర్ వెల్ఫేరు ఫండు), పారిశ్రామిక గృహనిర్మాణ స్కీము' ఎంప్లాయీస్ స్టేట్ ఇన్సూరెన్సుస్కీము మొదలగువాటిని ట్రేడ్ యూనియన్లు జాగ్రత్తగా పరిశీలించాలి. ఇవి కార్మికులకు సక్రమంగా ఉపయోగపడునట్లు, ప్రభుత్వం ఇంకా ఎక్కువ వసతులు చేకూర్చేటట్లు చూడాలి.

వీటిన్నిటికోసం పోరాడినప్పటికీ, కార్మికరంగంలో మన ప్రధాన కర్తవ్యం, ఈనాడు ప్రభుత్వం, పెట్టుబడిదార్లు ఆర్థికసంక్షోభాన్ని కార్మికులపై నెట్టడానికిచేస్తున్న ప్రయత్నాలను ప్రతిఘటించడమే. అంటే ఉద్యోగ రక్షణకొరకు, రేషనలైజేషన్, మరియు పనినుండితొలగింపుకు వ్యతిరేకంగా, పారిశ్రామిక రక్షణకు, జీతాల రక్షణ - హెచ్చింపుకొరకు, కరువుభత్యాన్ని అసలు జీతంలో కలిపివేయుటకు, ట్రేడ్ యూనియన్ హక్కులకొరకై ట్రేడ్ యూనియన్ కార్యకర్తలను పనినుండి తొలగించుటకు

వ్యతిరేకంగా, కనీస సాంఘిక క్షేమాభివృద్ధి కార్యక్రమం కోసము నిరంతరం పోరాడాలి. అన్నిపట్టణాల్లో పార్టీకమిటీలు కష్టజీవులవైపు దృష్టిని కేంద్రీకరించి, అసంఘటిత కార్మికులను సంఘటిత పరచాలి. ముఖ్యమైన పట్టణాల్లో ఎక్కువగా కార్మికులు కేంద్రీకరించబడిన కీలక కార్మిక కేంద్రాల్లోను కేంద్రీకరించి పనిచేయాలి. పనిచేయటంలో కార్మికవర్గ దైనందిన హక్కులకొరకు, పోరాటాల్లో ఐక్యతకొరకు, ట్రేడ్‌యూనియన్ల ఐక్యతకొరకు యెడతెగని కృషి చేయాలి. ప్రజాస్వామిక పద్ధతుల్లో పనిచేసే విశాల కార్మికయూనియన్లు నిర్మించాలి. దీనితోపాటు కార్మికవర్గంలో రాజకీయ ప్రచారం కొనసాగించి, వారు ఇతర పీడితవర్గాల పోరాటాలకు, ముఖ్యంగా రైతు పోరాటాలకు అండగా నిలబడునట్లు చూడాలి.

4. చేనేత పారిశ్రామికుల సమస్య నేడు తక్షణ సమస్యగా పార్టీని ఎదుర్కొంటున్నది. ప్రభుత్వం చేనేత పారిశ్రామికులకు తగిన ఆర్థిక సహాయము చేయాలని, పారిశ్రామికులకు నూలును ప్రభుత్వ సబ్సిడిద్వారా తక్కువధరలకు అందింపజేయాలని, పారిశ్రామికులకు పనులుగల్పించి చేనేత బట్టకు మార్కెటు సృష్టించాలని సెస్ ఫండును సద్వినియోగపరచాలనే చేనేతపారిశ్రామికుల తక్షణ కోర్కెలపై పారిశ్రామికులందరిని సంఘటితపర్చాలి. సహకార సంఘాలు పారిశ్రామికులకు లాభించేలా కృషిచేయాలి.

5. ముస్తాజరు పద్ధతివలన గీతపారిశ్రామికుల జీవితం దుర్భరమయి పోతున్నది. ముస్తాజరు పద్ధతిని, గ్రూపింగు గుత్త పద్ధతిని తీసివేసి గీత పారిశ్రామికులు స్వయంగా లేక వారి

సహకార సంఘాలద్వారా నేసుగా ఈ పరిశ్రమను నిర్వహించే విధంగా చేయాలనీ, ఇప్పటికంటె చౌకధరలకు చెట్లు గీట్టుబాటు గావాలనీ, గీత కార్మికులకు న్యాయమయిన జీతాలు ఇవ్వాలనే నినాదాలపైన గీత పారిశ్రామికులను వారి సంఘాలలో ఐక్య పర్చాలి.

6. మున్సిపాలిటీలు, పంచాయతీబోర్డులు మొదలైన స్థానిక స్వపరిపాలక సంస్థలలో సాధ్యమైనంతమంది ప్రజాప్రతినిధులు ఎన్నుకోబడేలా చూడాలి. అభివృద్ధి కాముకుల చేతుల్లోనున్న ఈ సంస్థల ద్వారా ప్రజలకు సాధ్యమైనంత ఎక్కువ మేలు జరిగేటట్లు చూడాలి.

7. తెలంగాణాలో పుర్వాను ప్రజలమీదరుద్దే అభివృద్ధి నిరోధక విధానంవల్ల ఇంతకాలంగా చుట్టుపట్ల రాష్ట్రాలలో వున్నంతవరకైనా విద్యాభివృద్ధిజరుగలేదు. నైజాం నిరంకుశత్వముకు బదులు కాంగ్రెసు పాలన వచ్చినప్పటినుండి మాతృభాషలో విద్యాబోధన జరుగడంవలన, ప్రజలలో విద్యయెడల కాంక్ష బాగా పెరగడంవలన, విద్యావిధానంలో మార్పులు వచ్చినాయి. అందువల్లనే స్కూళ్లు, కాలేజీలు పెట్టమని ప్రజలే ముందుకువచ్చి కోరుతున్నారు.

అనేక ప్రాథమిక పాఠశాలలు, హైస్కూళ్ళు కొత్తవి తెరువబడ్డవి. పాతవాటిల్లో సంఖ్యకూడా చాలా యెక్కువగా పెరిగింది. మన ఉద్యమాభివృద్ధికి తెలంగాణాలోని నిరక్షరాస్యత యెంతో ఆటంకంగావుంది. విద్యాభివృద్ధి యెంత యెక్కువగా జరిగితే అంత యెక్కువగా పార్టీస్థాయి, మన వుద్యమం యొక్క స్థాయికూడా పెరుగుతుంది. అందుచేత విద్యాభివృద్ధి

విషయంలో మనపార్టీ ప్రత్యేకశ్రద్ధ వహించాల్సివుంది. ప్రతి గ్రామంలో ఒక ప్రైమరీస్కూలు, ప్రతి కేంద్రగ్రామంలో ఒక హైస్కూలు, ప్రతి జిల్లాకు ఒక కాలేజికోసం ప్రయత్నించాలి.

8. ఎన్నికల అనంతరంనుంచి ప్రజలలో పెద్ద సాంస్కృతిక వెల్లువ లేచింది. సాహిత్య సమితులు, నాటక ప్రదర్శనలు, పుస్తక భాండాగారాల యేర్పాట్లు ముమ్మరంగా జరుగుతున్నవి. బుర్రకథ దళాలు, యక్షగానాలు మొదలైన ప్రదర్శనలు ప్రజల నెంతగానో ఆకర్షిస్తున్నవి. మన ఉద్యమాభివృద్ధికి విద్యతోపాటు వైజ్ఞానికాభివృద్ధి జరగడం ఎంతో అవసరం. మనం సాహిత్య సంఘాలలోనూ, యితర వైజ్ఞానిక సంస్థలలోనూ చేరి పనిచేయాలి. పుస్తక భాండాగారాలు, రాత్రి పాఠశాలలు సాధ్యమైన అన్ని చోట్ల స్థాపించాలి. బుర్రకథలు, యక్షగానాలు మొదలైనవి ప్రదర్శించే వైజ్ఞానిక దళాలను జిల్లాలలో ఏర్పాటు చేయాలి. సాధ్యమైనచోట్ల యువజన సంఘాలను ముఖ్యంగా పట్టణాలలో ఏర్పరచి ఆటలు, వైజ్ఞానిక కార్యక్రమాలను, మూఢాచారాలకు వ్యతిరేకంగా ప్రచారాన్ని సాగించాలి.

9. మన పార్టీయే ప్రథమంగా 1946 లో ఆంధ్రప్రజల నందరినీ ఏకంచేసి విశాలాంధ్రను ఏర్పర్చాలనే పిలుపు నిచ్చింది. అందుకోసం అపారమైన త్యాగాలనుకూడా చేసింది. నేడు విశాలాంధ్ర నినాదం సర్వజనామోదం పొందింది. మనం విశాలాంధ్రోద్యమాన్ని ప్రారంభించడం, అగ్రగామిగా కృషి చేయడంవల్లకూడా యావదాంధ్రదేశంలో మన పార్టీకి యింత బలమేర్పడటానికి ఆంధ్రప్రజల జాతీయ పార్టీగా గుర్తింపబడటానికి ఒక ప్రధాన కారణం. అందుచే విశాలాంధ్రను అను

కూలంగా వున్న అందరినీ సమీకరించి, ముఖ్యంగా మన పునాదివర్గాలైన కూలీ, రైతులను యీ ఉద్యమంలో విరివిగా పాల్గొనేటట్లు చేసి విశాలాంధ్రను వ్యతిరేకించే అభివృద్ధి నిరోధక కుల కుట్రలను భగ్నం చేయడం మనపార్టీయొక్క నేటి ప్రధాన బాధ్యతల్లో ఒకటిగా వుంది. ఇందుకోసం తెలంగాణా ఆంధ్ర మహాసభను పునర్నిర్మించడం, జిల్లా, తాలూకా సంఘాలను యేర్పరచడం, దీనిని విశాలాంధ్రను కోరే అభివృద్ధి కాముకులందరి వేదికగా చేయడం మొదలైన వాటికి మన పార్టీ పూనుకోవాలి. సాంస్కృతిక, వైజ్ఞానిక రంగాలద్వారా యీ ప్రచారం విస్తృతంగా జరుగునట్లు చూడాలి.

ప్రాంతీయ భాషను కోర్టుభాషగా ప్రభుత్వం అంగీకరించినా యింతవరకు సరిగా అమలు జరుగుట లేదు. దీనిపై ఆందోళనచేసి యిది పూర్తిగా అమలు జరుగునట్లు చూడాలి. పరిపాలనంతా ప్రాంతీయ భాషలో జరగాలని ఆందోళన చెయ్యాలి.

10. శాంతి ఉద్యమం యెంత విశాలమయిన ప్రాతిపదిక గలదో, దాని ప్రాముఖ్యత ఎంతగావుందో ప్రత్యేకముగా చెప్పవలసిన పనిలేదు. శాంతి ఉద్యమము ద్వారా రాజకీయవిభేదములతో నిమిత్తము లేకుండా శాంతినికోరే వారందరినీ సమీకరించవచ్చునని మన అనుభవమే రుజువు చేస్తావుంది.

కొరియా యుద్ధవిరమణ తర్వాత జెనీవా మహాసభ ఫలితంగా ఇండోచైనా యుద్ధవిరమణ జరగడం శాంతి ఉద్యమానికి మరో బ్రహ్మాండమయిన విజయంచేకూర్చింది. నెహ్రూ చౌ-ఎన్-లైల సంయుక్త ప్రకటన ప్రపంచంలో, ముఖ్యంగా

ఆసియాలో శాంతిరక్షణకై యెంతగానో తోడ్పడుతుంది. పరస్పర సరిహద్దులను, స్వాతంత్ర్యాన్ని గౌరవించడం, నిర్యుక్త ఒడంబడికలు కుదుర్చుకోవడం, ఒకరి ఆంతరంగిక వ్యవహారాలలో మరొకరు జోక్యం కల్గించుకోకపోవడం, సమానత్వం మరియు ఒకరి సరసన మరొకరు శాంతంగా మనడంలాంటి నెహ్రూ - చౌల సంయుక్త ప్రకటనలోని సూత్రాలు భారతదేశములో ప్రపంచశాంతికై అత్యంత విశాల ప్రజాసమీకరణ చేయుటకు చక్కని ప్రాతిపదికగా పనిచేస్తవి.

అమెరికన్ యుద్ధోన్మాదులు జాతీయంగా, అంతర్జాతీయంగా పన్నుతున్న కుట్రలను అడుగడుగునా బట్టబయలు చేస్తూ ఎదిరించాలి. కాశ్మీర్‌లోనికుట్రలు, పాక్ - అమెరికా సైనిక ఒడంబడికలద్వారా వారు భారతదేశానికి తలపెడుతున్న ప్రమాదాన్ని తీవ్రంగా ఎదిరించాలి. ఆగ్నేయాసియాలో తలపెడుతున్న సైనిక కూటమిని తీవ్రంగా ఖండించాలి. అమెరికన్ ఏజంట్లు, వివిధ మిషనరీలు ప్రచారసంస్థలద్వారా మనదేశంలోని మేధావులను ముఖ్యంగా యువజనులను తప్పుమార్గాన్ని బట్టించే ప్రయత్నాలుచేస్తున్నారు. మన తెలంగాణా ప్రాంతాలలో యీ ప్రయత్నాలు సాగుతున్నవి. అమెరికన్ యుద్ధోన్మాదులు సాగించే దుష్ప్రచారాన్ని, పన్నే కుట్రలను అడుగడుగునా యెదిరిస్తూ శాంతి నినాదాలపై గొప్ప ప్రజాసమీకరణ జరుపాలి. సోవియట్ యూనియన్, నవచైనాల శాంతి విధానాలను ప్రజలకు తెలుపుతూ భారత సోవియటు మైత్రి, చైనా భారత మైత్రికై ప్రజాభిప్రాయాన్ని దృఢంగా నిర్మించాలి.

పై నినాదాలు కార్యక్రమాన్ని ఆధారంగా జేసికొని హైద్రాబాదు పట్టములోనేగాక వివిధ జిల్లా తాలూకాలలో శాంతి సంఘాలను బలంగా నిర్మించాలి.

11. తెలంగాణా పోరాటంలో పురుషులతోబాటు స్త్రీలుకూడ అమోఘమైనపాత్ర నిర్వహించారు. సామాజిక, ఆర్థిక, విద్య, వైజ్ఞానిక సమస్యలపై, ఉదాహరణకు పర్దాపద్ధతికి వ్యతిరేకంగాను, పెండ్లి మరియు విడాకుల హక్కులు, ప్రసూతి శాలలు, శిశుసంరక్షణ పురుషులతోబాటు సమాన హక్కులు లాంటి తదితర సమస్యలపైన వారిని మహిళాసంఘాలద్వారా కదిలించాలి. ముఖ్యంగా కార్మిక, కర్షక స్త్రీలు తమతమ వర్గ సంస్థలలో ఎక్కువగా పాల్గొనేటట్లు చూడాలి. పార్టీ, మహిళా రంగాన్ని గురించి తగు శ్రద్ధవహించి మహిళాసంఘాల అభి వృద్ధికి పూనుకోవాలి.

12. విద్యార్థి ఉద్యమాభివృద్ధి గురించి మన పార్టీ ప్రత్యేకశ్రద్ధ వహించవలసియుంది. అభివృద్ధినిరోధక శక్తులు, మతసంస్థలు ఆర్. యస్. యస్. లాంటివి వారిని ఆకర్షించ డానికి తీవ్రమయిన ప్రయత్నాలు చేయుచున్నవి. అమెరికన్ గ్రంథాలయాలు, ప్రచారశాఖలు, పుస్తకాలు, పత్రికలద్వారా విద్యార్థులలో తమ అభివృద్ధి నిరోధక సిద్ధాంతాలను విరివిగా ప్రచారంలో బెట్టుతున్నారు. ఈ ప్రచారాన్ని ఎదిరించడానికి వెంటనే పూనుకోవాలి.

విద్యార్థులు, వారి సంస్థలు మొత్తం ప్రజాస్వామిక ఉద్య మములో ప్రముఖపాత్ర వహించగలవనే విషయాన్ని మనం గ్రహించాలి. వారి ప్రస్తుత చైతన్య స్థాయిని ఆధారంగా

జేసికొని సరయిన ఎత్తుగడ లవలంభిస్తే వేలకొలది విద్యార్థులను కదిలించడమేగాక వారితోపాటు అశేషమయిన మధ్యతరగతి ప్రజానీకం ఉత్సాహపూరితులై కదులుతారు. అభ్యుదయ సిద్ధాంతాలను విద్యార్థులలో విరివిగా ప్రచారం జేయడం, తద్వారా వారిని ఈ సిద్ధాంతాలవైపు ఆకర్షించడం ఎంతో అవసరం. స్వతంత్ర విద్యార్థి ఉద్యమముతోపాటు ఇతర ప్రజా ఉద్యమాల నిర్వహణకు గూడా విద్యార్థులు కార్యకర్తలుగాను, నాయకులుగాను వస్తారనే విషయాన్ని మరువగూడదు. విద్యా సమస్యలు, వైజ్ఞానిక కార్యక్రమము, జాతీయ అంతర్జాతీయ రాజకీయాలు ఎక్కువ విద్యాఅవకాశాలు కలిగించటం, విద్య కొరకు ప్రభుత్వం ఎక్కువ డబ్బు కేటాయించడం, విద్య అందరికీ అందుబాటులో నుండాలనే మొదలగు కోర్కెలపై విద్యార్థి సంఘాలను అభివృద్ధి చేయాలి.

13. కాంగ్రెసు ప్రభుత్వం అవలంబించుచున్న విధానాల వల్ల, అధికారుల పక్షపాత వైఖరివల్ల అల్పసంఖ్యాకులలో ముఖ్యంగా ముస్లిం ప్రజలలో చాలా అనుమానాలున్నాయి. వీటిని పురస్కరించుకొని మతసంస్థలు వారిని ప్రజాతంత్రఉద్యమా న్నుండే వేరుజేయుటకు ప్రయత్నిస్తున్నారు. వారి మాతృభాష లోనే వారికి విద్య గరుపబడాలని, ఉర్దూభాష మాట్లాడే ప్రజలు గణనీయమయిన సంఖ్యలోనున్న ప్రాంతంలో ఉర్దూ భాష బోధనకు శాలాశాలలో అవకాశాలుండాలని, ఉర్దూ మాట్లాడే ప్రజలుగల ప్రదేశాలలో పురపాలక సంఘా ల్లోను, స్థానిక కోర్టులలోను, దైనందిన కార్యకలాపాలలో హిందీ ఉర్దూభాషకు తగిన స్థానమివ్వాలని, ఉద్యోగాల నుండి

ఎవరినీ కక్షతో తొలగించరాదనే న్యాయ సమ్మతమైన హక్కుల రక్షణ, మరియు సాధనకై పార్టీ అల్పసంఖ్యాకులకు పూర్తిసహాయంచేయాలి. ఈవిధంగా వారిని విశాలాంధ్ర ఉద్యమము,మరియు తదితర ప్రజాసంఘాలలో సమైక్యపర్చాలి. వారిలో వ్యాపింప చేయబడుతున్న అభివృద్ధినిరోధక ప్రచారాన్ని యెదిరించాలి.

14. మన సర్వతోముఖ కార్యాచరణలో శాసనసభ కార్యక్రమంగూడా ఒక ముఖ్యాంశం. శాసనసభలో మనకు బలమైన స్థానమంది. నేటి మన శాసనసభా కార్యక్రమంలో ప్రధానలోపం బయటి ప్రజలలో సాగించే కార్యక్రమానికి, శాసనసభ లోపల చేసేపనికి సమన్వయం లేకపోవడమే. అనేక సందర్భాలలో శాసనసభలలో సరియయిన నినాదాలిచ్చినప్పటికీ బయట వీటిమీద ప్రజాసమీకరణ లేకపోవుటవలన సత్ఫలితాలు రాలేదు. కౌలుదారీచట్టం, పోలీసుఖర్చు తగ్గింపు, జాగీర్ల పరిహారపు వాయిదా, నైజాంకు యిచ్చే భరణం నిలుపదల మొదలగు యెన్నో సమస్యలమీద మన శాసనసభ్యులు రాష్ట్ర శాసనసభలో ప్రభుత్వాన్ని బట్టబయలుచేసినా, బయట ప్రజాసమీకరణ చేయకపోవుటవలన కాంగ్రెసు ప్రభుత్వం తన మాట నెగ్గించుకోగలిగింది. ఇదేవిధంగా కొన్ని సందర్భాలలో బయట ప్రజావుద్యమాల సమస్యలు అసెంబ్లీలో ప్రతిబింబించలేదు. బయట ప్రజాకార్యక్రమానికీ, శాసన సభల్లో కార్యక్రమానికీ సమన్వయంచేయాలి. శాసనసభలో తీసుకునే నినాదాలను బలపర్చుతూ బయట ప్రజాసమీకరణ చేయాలి. శాసనసభ్యులు ప్రజలతోను, ప్రజాసమస్యలతోను సన్నిహిత

సంబంధముంచుకొని అవసరమైనప్పుడల్లా వారికి సాయ పడాలి. ప్రతిశాసనసభ సమావేశానంతరం తమ నియోజక వర్గాలలో పర్యటన గావించి, శాసనసభ విశేషాలను ప్రజలకు వివరించాలి. అప్పుడే శాసనసభ వేదికను యిప్పటికన్న యింకా ఎక్కువగా ప్రజల సమస్యలను ప్రతిబింబించేలాగ వుపయోగించుకోగలము.

15. ప్రజా వుద్యమాలను దెబ్బతీయుటకు కాంగ్రెసు, ప్రజాసోషలిష్టు పార్టీవాళ్ళు సాగిస్తున్న గూండాయిజాన్ని ప్రజలను సమీకరించుటద్వారా ఎదుర్కోవాలి. ప్రజాతంత్ర ఉద్యమాలను అణచుటకై ప్రభుత్వం వివిధ రూపాలలో సాగిస్తున్న నిర్బంధ విధానాన్ని అరికట్టుటకు యీ క్రింది పనులు చెయ్యాలి.

(1) నిర్బంధ విధానానికి ప్రభుత్వం చూపెడుతున్న సాకులను బట్టబయలుచేస్తూ, భూస్వాముల, ఇతర దోపిడీవర్గాల రక్షణకు ప్రభుత్వ మెలా పూనుకుంటున్నదో చూపెట్టాలి.

(2) పోరాటకాలపునాటి కేసులను, వారంట్లను ఉప సంహరించి రాజకీయ ఖైదీల నందరిని విడుదల చెయ్యాలని ఆందోళన సాగించాలి. దీనికొరకు ప్రజలను సమీకరించాలి.

(3) కేసుల డిఫెన్సుకొరకు నిధిని సేకరించాలి.

16. రైతులకు తమ పోరాటాలద్వారా గాక భూస్వాముల దయాదాక్షిణ్యాలద్వారా భూమి వస్తుందని భ్రమలు కల్పించే భూదాన యజ్ఞం మొదలైనవాటి యొక్క నిజస్వరూపాన్ని బట్టబయలు చెయ్యాలి. అలాగే అభివృద్ధి నిరోధకులు

ప్రజలలో ప్రచారం చేస్తున్న కులమతతత్వ వాదాలకు వ్యతిరేకంగా సిద్ధాంత పోరాటం సాగించాలి.

ఈ సర్వతోముఖమైన కార్యాచరణ సందర్భంలో పార్టీ సభ్యులకు ఒక హెచ్చరిక ఇవ్వాల్సివుంది. ఈ తీర్మానంలో ఇవ్వబడిన కార్యక్రమమంతా ప్రస్తుత వ్యవస్థ పరిమితుల్లోనే, కాంగ్రెసుపాలన ఇలా వుండగానే పూర్తిగా అవుతుందనిగానీ, ప్రజల కోరికలు పూర్తిగా నెరవేరుతవనిగానీ ఎవ్వరూ భ్రమపడ నవసరం లేదు. ఈ కార్యక్రమంలో ప్రజాబలాన్నాధారంగా జేసుకొని కొన్ని హంశాలను ప్రస్తుతం సాధించవచ్చు. అందువల్ల ప్రజలకు కొంత తృప్తిగలగటమేగాక తమ బలముద్వారా కొన్ని సమస్యలు సాధించగలమనే ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. ఈ విజయాల నాధారంగా జేసుకొని ప్రజలను గమ్యస్థానం వైపుకు తీసుకపోవడానికి అవకాశ మేర్పడుతుంది. సాధించలేనటువంటి ప్రధాన కోర్కెలను ఏ కారణాలవల్ల సాధించలేక పోయామో వారు అనుభవంలో చూస్తారు. దీనివల్ల ప్రజల రాజకీయ చైతన్యంకూడా పెరుగుతుంది. ఈ వుద్దేశ్యంలోనే సర్వతోముఖమైన కార్యాచరణ పార్టీ ముందు వుంచబడుతుందనే విషయాన్ని గమనించాలి.

పైన చెప్పబడిన సర్వతోముఖ కార్యాచరణ లక్ష్యం, విస్తృత ప్రజాసంఘాల నిర్మాణంతోపాటు ప్రజాస్వామ్య పార్టీలు, గ్రూపులు, వ్యక్తుల నందరినీ వివిధ ప్రజా సమస్యల మీద ఐక్యపరచి, విశాలమైన ప్రజాసంఘటనను రూపొందించడంకూడా అయివుంది. ఈ సమస్యనుగూర్చిన వివరాలలోకి

పోయేముందు ప్రస్తుతం తెలంగాణా రాజకీయ రంగంలోవున్న పార్టీల, గ్రూపుల స్వభావాన్ని గూర్చి పరిశీలించడం అవసరం.

తెలంగాణాలో రెండే రెండు ప్రధాన రాజకీయ పార్టీలున్నవి. మొదటిది కమ్యూనిస్టుపార్టీ, రెండవది కాంగ్రెసు. కమ్యూనిస్టుపార్టీ సుప్రసిద్ధమైన తెలంగాణా పోరాటానికి నాయకత్వం వహించి నిలబడుటవలన కష్టజీవులైన ప్రజలలో - ముఖ్యంగా గ్రామీణ ప్రజల్లో - బలమైన స్థానాన్ని సంపాదించుకుంది. కష్టజీవులైన ప్రజలకు నాయకుడుగా కమ్యూనిస్టు పార్టీ నిలచి వుంది. కాంగ్రెసు తెలంగాణాలోని అభివృద్ధి నిరోధకశక్తులకు నాయకుడుగా నిలబడివుంది. అయితే దీని అర్థం పీడితప్రజల్లో ఏ ప్రాంతములోనూ కాంగ్రెసుమీద భ్రమలు లేవనికాదు. తెలంగాణాలోకూడా రాజకీయంగా అంతగా అభివృద్ధిచెందని ప్రాంతాలలో కాంగ్రెసు ప్రభుత్వాధికారం చేబట్టి వుంటడం కారణంగాగాని, మరే ఇతరకారణాలవల్లగాని కాంగ్రెసుయెడల ప్రజలలో - ముఖ్యంగా పైతరగతులలో భ్రమలున్నవి. స్థూలంగా చెప్పాలంటే కమ్యూనిస్టుపార్టీ పీడితప్రజల ప్రయోజనాల రక్షణకు, కాంగ్రెసువార్టీ దోపిడీవర్గాల రక్షణకూ కంకణం కట్టుకొని ఉన్నది.

ఈ రెండు ప్రధాన పార్టీలతోపాటు మరికొన్ని చిన్న పార్టీలు, గ్రూపులుకూడ తెలంగాణాలో వున్నవి. ప్రజాసోషలిస్టుపార్టీ హైద్రాబాదు, సికింద్రాబాదు, ఒరంగల్లు మొదలగు పట్టణాలలో, కార్మికవర్గంలో కొంత పునాదిని కలిగివుంది. అలాగే నిజామాబాదు, కరీంనగరు, ఆదిలాబాదు జిల్లాలలో గత జనరల్ ఎన్నికలలో మన పార్టీపేరునుకూడ ఉపయో

గించుకొని కొన్ని సీట్లను గెలుచుకొంది. ఈ పార్టీ యొక్క పాలసీ పూర్తిగా అభివృద్ధినిరోధక మయినది. కమ్యూనిస్టు వ్యతిరేకత, సోవియట్ వ్యతిరేకత, ప్రజాఉద్యమాల విచ్ఛిన్నం యీ పార్టీ పాలసీయొక్క పునాదిరాళ్ళు. అక్కడక్కడ గుండాయిజం ప్రయోగించడంలో గూడ వెనుదీయుట లేదు. ఇది కాంగ్రెసుకు రెండవ రక్షణశ్రేణిగా ఉపయోగపడుతున్నది. అయినప్పటికి సోషలిస్టు తీవ్రవాద పదజాలములో కాంగ్రెసుకు బూటకపు వ్యతిరేకత ప్రదర్శన, ప్రజాఉద్యమాలను పెడ మార్గాలను పట్టించే నామమాత్రపు సత్యాగ్రహపోరాటాలు మొదలైన వాటితో ప్రజలను, ప్రజాస్వామ్యాన్ని కాంక్షించే యువకులను, కొంతవరకు మోసగించ గలుగుతుంది. ప్రజాస్వామ్యవాదుల ఐక్యత, ఐక్యప్రజాసంఘటన నిర్మాణంలో కాంగ్రెసు నాయకత్వంతోపాటు ప్రజాసోషలిస్టు నాయకత్వాన్ని గూడా అడుగడుగున పోరాడుకుంటూ ముందుకు సాగిపోవలసిన పరిస్థితి నేడు మన పార్టీ ముందుంది.

దీనితోపాటు ముస్లింప్రజలలో జమాయతె ఇస్లామి చేస్తున్న దుష్ప్రచారాన్ని, ఆర్యసమాజ నాయకులు ప్రజలను పెడమార్గము బట్టించడానికి గౌరక్షా, శుద్ధి ఉద్యమాలద్వారా చేస్తున్న ప్రచారాలను ఎదిరించాలి.

పై పార్టీలతోపాటు హైద్రాబాదు, సికింద్రాబాదు పట్టణాలకు పరిమితమయిన ప్రజాస్వామ్యవాదులతో కూడియున్న డెమాక్రటిక్ పీపుల్సుపార్టీఉంది. హరిజనులలో అక్కడక్కడ కొద్ది గొప్ప పలుకుబడివున్న నిమ్న జాతుల సమాఖ్యకు చెందిన గ్రూపు మరొకటుంది.

ఈ పార్టీలు, గ్రూపులుమాత్రమేకాక ఏ పార్టీకి చెందని అభివృద్ధికాముకులైన వ్యక్తులు తెలంగాణా అంతటా వున్నారు.

1952 ఎన్నికలకుముందు హైద్రాబాదుసంస్థాన మంత టికీ కలిపి ప్రజాస్వామ్యాన్ని కోరే పార్టీలు, గ్రూపులు, వ్యక్తులతోకూడిన జనతంత్ర సంఘటన ఏర్పడింది. కమ్యూనిస్టు పార్టీ డెమాక్రటిక్ పీపుల్సుపార్టీ, లీగ్ ఆఫ్ సోషలిస్టు వర్కర్సు, కిసాన్ కాంగార్ పక్ష్, ప్రజాస్వామ్యాన్ని కాంక్షించే వ్యక్తులు దీనిలో చేరారు. అయితే హైద్రాబాదు, సికింద్రాబాదు పట్ట ణాలను మినహా మిగిలిన తెలంగాణాప్రాంత మంతటిలోను కమ్యూనిస్టుపార్టీతప్ప మరే ఇతరపార్టీగాని, గ్రూపుగాని జనతంత్ర సంఘటనలో లేవు. తెలంగాణా జిల్లాలలో కమ్యూనిస్టుపార్టీ, అక్కడక్కడవున్న కొంతమంది వ్యక్తులతో కూడుకొని మాత్రమే యీ జనతంత్రసంఘటన ఉన్నది.

తెలంగాణాలో పైన వివరించిన వివిధపార్టీల పరిస్థితి దృష్ట్యా ప్రజాస్వామ్యవాదుల ఐక్యత సాధించేవిషయం పరిశీ లించుదాము. మనము పోరాటరోజుల్లో కాంగ్రెసుపార్టీతో భూమిసమస్యమీద సూటియైన పోరాటాన్ని సాగించాం. నేడు మనం పైన వివరించిన సర్వతోముఖ కార్యాచరణద్వారా కాంగ్రెసుయెడ భ్రమలున్న ప్రజలను ఆకర్షించాల్సిన అవసర ముంది. కాంగ్రెసులో అభివృద్ధిని కోరేవారిని కూడా వివిధ సమస్యలమీద కలుపుకరావాలి. ఆలాగే ప్రజాసోషలిస్టు పార్టీలో వున్న ప్రజలను, అభివృద్ధికాముకులన్నూ కలుపుకు రావాలి. గతంలో సర్వతోముఖకార్యాచరణ లేకపోవడం వలన ఇతర పార్టీలలోని అభివృద్ధికాముకులను కలుపుకు

రావడం సాధ్యమయ్యేదికాదు. కాని నేడు శాంతిఉద్యమం, విశాలాంధ్ర సమస్య, ప్రాజెక్టులు మొదలైనవాటిమీద వారిని కలుపుకరావడం సాధ్యమేనని మనకు అనుభవమే రుజువు చేస్తూవుంది. భూమి, కూలి మొదలైన వర్గసమస్యలమీద మనం పీడిత ప్రజల ప్రక్కన నిలబడి ఏమాత్రం జంకూ గొంకూ లేకుండా పాటుపడాలి. అదేసమయంలో వీటిమీద వ్యతిరేకించినవారినిసైతం మిగతా సమస్యలమీద కలుపుకరావడానికి తీవ్రప్రయత్నం చేయాలి. ఏ సమస్యమీద ఎవ్వరు కలిసివస్తే అట్టివారందరినీ సమీకరించడం మన ఎత్తుగడగా వున్నప్పుడే విశాలమైన ఐక్య ప్రజా సంఘాలను నిర్మించగలగడం, అభివృద్ధి నిరోధకశక్తులను, వారి రక్షణకు పూనుకున్న కాంగ్రెసు ప్రభుత్వాన్ని పూర్తిగా ప్రజలనుంచి వేరుచేయడం జరుగుతుందని మనం గుర్తుంచుకోవాలి. ఈ విధంగా సాగింపబడే సర్వతోముఖమైన కార్యాచరణ పర్యవసానంగానే ప్రస్తుతం వున్న జనతంత్రసంఘటనలో తెలంగాణాలోని అభ్యుదయ కాముక గ్రూపులను, వ్యక్తులను, అందరినీ సమీకరించి విశాలమైన ఐక్య ప్రజాసంఘటనను నిర్మించడం సాధ్యమవుతుంది. తద్వారా మన లక్ష్యమైన ప్రజాతంత్ర ప్రభుత్వ స్థాపనవైపుకు ప్రజలను పురోగమింపచేయడం సాధ్యమవుతుంది.

## కమ్యూనిస్టుపార్టీని సుశిక్షితమైన, బలోపేతమైన పార్టీగా పునర్నిర్మించాలి

తెలంగాణాలో మన పార్టీకి ప్రజల్లోవున్న అపారమైన పలుకుబడికీ, నేటి మన పార్టీ నిర్మాణస్థితికీ మధ్య పెద్ద అంతరం

వున్నది. తెలంగాణాలో పార్టీ నిర్మాణబలహీనత ఈనాటిది కాదు. పార్టీ పుట్టుకనుండి ఎప్పుడూ పార్టీకి సుశిక్షితమైన అన్ని హంగులు కలిగిన పార్టీ నిర్మాణం ఏర్పరుపబడలేదు. ప్రారంభం నుండి ఏదో కొన్ని ప్రాంతాలలో తప్ప సెల్లులు నిర్మించబడలేదు. కమిటీలు మాత్రమేవుండి పనిజేసేవి. సెల్లుల నిర్మాణం లేదు. పార్టీ కమిటీలుసైతం ఆయా ప్రాంతాల సమస్యలమీద ఎప్పటి కప్పుడు నిర్ణయాలిచ్చి నాయకత్వం వహించే కమిటీలుగా తమ బాధ్యతలను నిర్వహించేవికావు. 1946 లో సాయుధ గెరిల్లా పోరాటం ఆరంభించిన తర్వాతనుండి అక్కడక్కడ వున్న పార్టీ సెల్లులుకూడ మాయమైపోయాయి. పార్టీ నిర్మాణం, దళాలు, ఏరియా కమిటీల రూపంలోకి మారి పోయింది. ఈ పరిస్థితి 1952 ఎన్నికలవరకు సాగిపోయింది. ఎన్నికల తర్వాత సైతం పార్టీలో వచ్చిన తీవ్రమైన అంతర్గత విభేదాల కారణంగా పార్టీని సవ్యమైన పద్ధతులమీద పునర్నిర్మించుకో లేకపోయాము. స్థానిక సెల్లుల నిర్మాణమాట అటుంచి పార్టీ కమిటీలుగూడా విచ్ఛిన్నమై ముఠాధోరణులు తలయెత్తి పార్టీ పూర్తిగా స్థంభించిపోయింది. అయితే ఈమధ్య పరిస్థితులు కొంతవరకు చక్కబడినా పార్టీ మాత్రం అంతర్గత సంక్షోభా న్నుండి పూర్తిగా బయట పడలేదు.

నేడు పార్టీకివున్న అపారమైన పలుకుబడికి అనుగుణ్యాంగానూ, పార్టీమీద నేడున్న గురుతర భారాన్ని మోయగలిగిన విధంగానూ మన పార్టీని పునర్నిర్మించాల్సిన ప్రధాన బాధ్యత నేడు మనమీద వుంది. పార్టీ పునర్నిర్మాణ బాధ్యత నేడు మన ముందున్న బాధ్యత లన్నింటిలోకి కీలకమైన బాధ్యత. ఈ

బాధ్యత నెరవేర్చనిది పైజెప్పబడిన ప్రజాకార్యక్రమంలోని యే హాంశాన్ని సంపూర్ణంగా నెరవేర్చడం సాధ్యంకాదనే విషయాన్ని పార్టీ సభ్యులంతా గుర్తుంచుకోవాలి.

పార్టీ పునర్నిర్మాణం జరగాలంటే మొదట పార్టీలో నేడున్న ముఠాధోరణులకు స్వస్థిచెప్పాలి. పార్టీ పద్ధతులను క్రమశిక్షణను యెట్టి మినహాయింపులు లేకుండా నెలకొల్పాలి. పార్టీకి పునాదియైన సెల్లు విధానాన్ని పునరుద్ధరించాలి. పైకమిటీనుండి క్రింది సెల్లువరకు క్రమబద్ధమైన విధానాన్ని అనుసరించి పని ప్రారంభించాలి. పార్టీసభ్యులకూ, కార్యకర్తలకు వారి వారి స్థాయికి, బాధ్యతలకు అనుగుణ్యమైన రాజకీయ శిక్షణను స్కూళ్ళద్వారా ఇవ్వాలి. ఈ విధంగా సుశిక్షితమైన బలోపేతమైన పార్టీగా కమ్యూనిస్టుపార్టీని పునర్నిర్మించడం అవసరం.



# తెలంగాణా పార్టీ ప్రథమ మహాసభ

## పార్టీ నిర్మాణంపై తీర్మానం

1. 1952 సాధారణ ఎన్నికల్లో భారత కమ్యూనిస్టు పార్టీ ఘనమైన విజయాలను సాధించింది. పార్టీ ప్రజా సమస్యలను తీసుకొని పనిచేసి, ప్రజా సంఘాలను నిర్మించి, ప్రజా పోరాటాలకు నాయకత్వం వహించిన ప్రాంతాల్లోనే ఈ విజయాలు సాధ్యపడినవి. ఈ ప్రాంతాల్లోనే ప్రజాఉద్యమం పురోగమించింది. పార్టీ, కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజాతంత్ర శక్తులను ఐక్యపరచి, వాటికి నాయకుడుగా ముందుకు వచ్చింది. తక్కిన ప్రాంతాల్లో, ఇలాంటి బలమైన ప్రజాతంత్ర ఉద్యమం లేకపోవడమో, లేదా, ప్రజల్లో ఉన్న కాంగ్రెసు వ్యతిరేకతను ప్రజా సోషలిస్టులు, మతోన్మాద అభివృద్ధి నిరోధకులు పెడమార్గాన పట్టించి ప్రజాఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయడానికి ఉపయోగించడమో జరిగింది.

కేంద్ర కమిటీ, నిర్మాణ తీర్మానంలో ఈ సంఘటనలన్నిటినీ పరిశీలించి, ప్రజాఉద్యమ పురోగమనానికి పార్టీ నిర్మాణానికున్న సంబంధాన్ని, నేటి పార్టీ నిర్మాణస్థితిని గూర్చి విస్పష్టమైన సూత్రీకరణ చేసింది. అదేమంటే: ఆర్థికసంక్షోభం వలన ప్రజల్లో అసంతృప్తి తీవ్రమవుతున్నది. ఈ అసంతృప్తిని సరైన మార్గాన నడిపించినప్పుడే ప్రజాఉద్యమం అభివృద్ధి

చెందుతుంది. ఈ కర్తవ్యాన్ని.............ప్రజా ఉద్యమం అభివృద్ధి కావాలంటే ఆర్థికసంక్షోభం తీవ్రతరంకావడం, దాని ఫలితంగా ప్రజల్లో తీవ్రమైన అసంతృప్తి చెలరేగడ మొక్కటే చాలదు. ఈ అసంతృప్తిని సరైన మార్గాన నడిపించి ప్రజా ఉద్యమాన్ని నిర్మించవలసిన అవసరముంటుంది.

ఈ కర్తవ్యాన్ని నిర్వహించగలిగింది ప్రజల్లో ముఖ్యంగా పునాది వర్గాల్లో వేళ్లూనుకొనియున్న ప్రజానీకాన్ని ఐక్యంగా కార్యాచరణకు దింపగల క్రమశిక్షణగల బలీయమైన కమ్యూనిస్టుపార్టీయే. కానీ పార్టీకి ప్రజల్లోఉన్న పలుకుబడికీ, నిర్మాణ బలానికీ మధ్య పెద్ద అంతరమేర్పడి ఉన్నది. ఈ అంతరాన్ని పోగొట్టినప్పుడే ప్రజాఉద్యమాన్ని వృద్ధిచేసి ముందుకు కొని పోవడంలో పార్టీ తన పాత్రను జయప్రదంగా నిర్వహించగలదు. దీనికై పార్టీని రాజకీయంగా, సిద్ధాంతరీత్యా నిర్మాణరీత్యా అభివృద్ధిపరచాలి. పాత ప్రాంతాల్లో పార్టీని దిట్టపరచి కొత్త ప్రాంతాలకు నిర్మాణాన్ని వ్యాపింపజేయాలి. ఈ విధంగా పార్టీని బలపరచడం మీదనే, ఇకముందు ప్రజాఉద్యమ పురోగమనం ఆధారపడి ఉంటుందనీ కేంద్రకమిటీ స్పష్టంచేసింది.

పార్టీ నిర్మాణం మొక స్వతంత్ర కర్తవ్యమనీ, పార్టీ అంతా దీనిని నేటి కీలకమైన రాజకీయ కర్తవ్యంగా గుర్తించి నిర్వహించడానికి పూనుకోవాలనీ చెపుతూ పార్టీని బలపరచ డానికి కొన్ని స్పష్టమైన కర్తవ్యాలను నిర్ణయించింది. వాటిలో ముఖ్యమైనవి ఇవి :

(1) పార్టీలో సమిష్టి పనివిధానాన్ననుసరించాలి. సమిష్టి నాయకత్వాన్ని వృద్ధిచేయాలి.

(2) సవ్యమైన (Princepled) పార్టీ అంతరంగిక పోరాటాన్ని సాగించాలి.

(3) కేంద్ర కమిటీ, రాష్ట్ర కమిటీ కేంద్రాలను బల పరచాలి.

(4) సెల్లులతో సహా క్రింది యూనిట్లన్నిటినీ బలపరచి వాటిలో చొరవను అభివృద్ధి చేయాలి.

(5) కేడరుకు రాజకీయ సిద్ధాంత శిక్షణ నివ్వాలి.

(6) ప్రజా సంఘాలను నిర్మించి వాటిని స్వతంత్రంగా పనిచేయించాలి.

(7) పార్టీ కార్యకలాపాలను ప్లాను ప్రకారంగాను, ఎడ తెరపి లేకుండాను, సర్వతో ముఖంగాను సాగించాలి.

2. కేంద్ర కమిటీ చేసిన ఈ సూత్రీకరణ, నిర్ణయించిన పై కర్తవ్యాలు తెలంగాణా పార్టీకి కూడా వర్తించుతాయి. తెలంగాణాలో కమ్యూనిస్టు పార్టీకి అపారమైన రాజకీయ పలుకు బడి ఉన్నది. ఈ పలుకుబడిని ప్రజాఉద్యమంగా రూపొందించగల నిర్మాణబలం పార్టీకి లేదు. ప్రజాఉద్యమం అభివృద్ధి కావడానికి ఇది పెద్ద ఆటంకంగా తయారైంది. దీనితోబాటు కేంద్రకమిటీ తీర్మానంలో చెప్పబడిన ఇతర బలహీనతలు కూడా తెలంగాణా పార్టీలో ఉన్నవి. వాటిని పోగొట్టుకొనుటకు చేయబడిన సూచనలు తెలంగాణాకు కూడా వర్తించుతాయి. కనుక పార్టీ యూనిట్లన్నీ కేంద్ర కమిటీ నిర్మాణ తీర్మానాన్ని శ్రద్ధతో అధ్యయనంచేసి, దానిలో ఇవ్వబడిన సూచనలను అమలు జరుపాలి.

దీనితోబాటు తెలంగాణాలో నేటి పార్టీ పరిస్థితిని, పార్టీ నెదుర్కొంటున్న నిర్మాణ సమస్యలను స్థూలంగా పరిశీలించి రాజకీయ తీర్మానంలో సూచింపబడిన కర్తవ్యాల కనుగుణ్యమైన నిర్మాణ కర్తవ్యాలను నిర్ణయించుకొని, వాటి ననుసరించి పార్టీ నిర్మాణాన్ని బలపరచడం ఎంతైనా అవసరం.

## తెలంగాణాలో పార్టీ పరిస్థితి, పార్టీ నెదుర్కొంటున్న సమస్యలు

3. తెలంగాణాలో కమ్యూనిస్టు పార్టీ, నిజాం నిరంకుశత్వానికి, ఫ్యూడల్ విధానానికి వ్యతిరేకంగా ప్రజలు సాగించిన వీరోచిత పోరాటానికి నాయకత్వం వహించి పౌరసత్వాలు, పరిమితమైన భూసంస్కరణలు, మాతృభాషలో విద్య మొదలగు ప్రజాతంత్ర హక్కులను సాధించుటలో తోడ్పడింది. దీని ఫలితంగా, పార్టీ ప్రజల్లో అపారమైన రాజకీయ పలుకుబడి సంపాదించి, ప్రజాతంత్రశక్తులను ఐక్యపరచి, ఎన్నికల్లో కాంగ్రెసుకు వ్యతిరేకంగా గొప్ప విజయాలను సాధించింది. సాధారణ ఎన్నికలకు పూర్వం నిషేధింపబడియున్న పార్టీకి, ఎన్నికల తర్వాత నిషేధం తొలగిపోయి, బహిరంగంగా పనిచేయడానికి అవకాశాలేర్పడినవి. ప్రజలు తమ జీవితానికి సంబంధించిన అన్నిరంగాల్లోనూ నాయకత్వం కొరకు పార్టీవైపుకే చూడసాగారు.

రెండవవైపున అధికారంలోనున్న కాంగ్రెసుపార్టీ, నిజాం పూర్వం అనుసరిస్తూ వచ్చిన నిరంకుశ పద్ధతులను మానివేసి, కొత్త పద్ధతులద్వారా పరిపాలన సాగించ మొదలు పెట్టింది. ప్రజలు సాధించుకున్న ఈ ప్రజాతంత్ర హక్కులను కాజేయ



4

డానికీ, ప్రజల్లో చీలికలను కలుగజేసి ప్రజా ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయడానికీ, చట్టాలను వుపయోగించుతున్నది; కులమత తత్వాన్నీ, స్థానిక తత్వాన్ని ప్రోత్సహించుతున్నది.

ఫ్యూడల్ భూస్వామ్యవర్గం వెనుకటి నగ్నమైన దౌర్జన్య పద్ధతులను మానుకొని, చట్టాలద్వారా, కోఆపరేటివు మొదలగు సంస్థలను, కుల తత్వాలను ఉపయోగించుకొని, రైతాంగం లోనూ, వ్యవసాయ కూలీలలోనూ చీలికలు కలిగించి, ఐక్య రైతాంగ ఉద్యమాన్ని అభివృద్ధి కానీయకుండా ఆటంక పరు చుతూ, తమ దోపిడీ విధానాన్ని, అధికారాన్ని కొత్త పద్ధ తులలో కొనసాగించుతున్నారు.

పరిస్థితులలో వచ్చిన ఈ మార్పు ననుసరించి ప్రజా ఉద్యమ నిర్మాణాన్ని కూడా కొత్త పద్ధతులలో సాగించవలసి వచ్చింది. పాలకవర్గాల, ఇతర విచ్ఛిన్న శక్తుల ఎత్తుగడలను ఎప్పటికప్పుడు అవగాహన చేసుకొంటూ వాటి కనుగుణ్యంగా పట్టు విడుపుల (Flexible) తో గూడిన ఎదురు ఎత్తుగడలను అనుసరించుతూ ప్రజలకు నాయకత్వం వహించినప్పుడే, పార్టీ ప్రజాతంత్ర హక్కులను కాపాడ గలుగుతుంది. కాని పార్టీ ఈ నూతన పరిస్థితుల కనుగుణ్యమైన నినాదాలను, ఎత్తుగడ లను రూపొందించుకొనడంలోనూ, నిర్మాణరీత్యా ఐక్యంగా పనిచేయడంలోనూ, విఫలమైనందున అదివరకే పార్టీలో నున్న అంతర్గత సంక్షోభం తీవ్రతరమైంది. పార్టీ నిర్మాణం ఈ బాధ్య తలను నిర్వహించలేనంతగా బలహీనపడిపోయింది.

4. తెలంగాణాలో పార్టీ నిర్మాణటం బలహీనంగా ఉండడడము ఇప్పుడేకాదు. పార్టీ పుట్టుకనాటి నుండి ఇదే స్థితి.

గ్రామాల్లో పనిచేసే మిలిటెంటులందరినీ పార్టీ సభ్యులుగా గుర్తించడం, ఈపార్టీ సభ్యులు సెల్లుల్లో నిర్మాణింపబడక, సెల్లుల ద్వారా పనిచేయక వ్యక్తులుగానూ, దళాలుగానూ పనిచేసే వారు. పార్టీ కమిటీలు కమిటీలుగా పనిచేయక, వాటిలోని "ముఖ్యులు" నిర్ణయాలు తీసుకోవడం, ఆ నిర్ణయాలను కార్య కర్తల ద్వారా, సాధారణ పార్టీ సభ్యుల ద్వారా అమలు జరిపించడం జరిగేది. ఈ విధంగా నాయకులు - అనుచరుల ఫక్కీలో పని సాగిపోయేది. 1946-52 మధ్యకాలంలో అదివర కున్న సెల్లులు, పార్టీకమిటీలుకూడా మాయమైపోయి ఏరియా కమిటీలూ, దళాల రూపంలోకి పార్టీ నిర్మాణమంతా మారి పోయింది. "నాయకులు - అనుచరుల" విధానం మరీ ఉచ్ఛ స్థాయికి పోయింది. ఈ విధంగా పార్టీ నిర్మాణం ఆనాటి నుండే బలహీనంగా ఉంటూ వచ్చింది.

తెలంగాణా ప్రాంతానికంతటికీ వున్నత కమిటీగా వున్న తెలంగాణా కమిటీ నాయకత్వపు కమిటీగా పనిచేయలేక పోయింది. కమిటీ సమావేశాలు అప్పుడప్పుడు జరిగినా, సెక్ర టేరియేటు ప్రధానంగా కమిటీ స్థానంలో పనిచేసింది. తెలంగాణా వ్యాపితంగా ప్రజలను కదిలించడానికి అవకాశమున్న అనేక ముఖ్యసమస్యలపై, కింది కమిటీలకు కార్యక్రమాన్ని అందించి ప్రజలను పెద్దఎత్తున సమీకరించలేకపోయింది. శాసనసభలోనూ బయటా జరుగుతున్న కార్యకలాపాలను, ట్రేడు యూనియన్ రైతు సంఘం మొదలగు ప్రజారంగాలను సమన్వయం చేసే కేంద్రంగా పనిచేయలేక పోయింది. సెక్రటేరియటులో పని విభ జన, నిర్ణయాలను అమలు జరుపుటకు సభ్యులు వ్యక్తిగతంగా

బాధ్యతలు తీసుకోవడం, నిర్ణయాలను ఎంతవరకు అమలు జరిపిందీ, అమలుజరిపే సందర్భంలో వచ్చిన అనుభవాలను కమిటీ సమావేశాలలో రిపోర్టుచేయడం, చర్చించడం జరుగుటలేదు. ఈ విధంగా సమిష్టి కార్యాచరణ అనేది అమలు జరగకుండా వ్యక్తిగతంగా పనిచేయడమే ముఖ్యంగా జరుగుతున్నది. సమస్యలను సమగ్రంగా స్టడీచేసి, వాటిపై కింది కమిటీలకు అవసరమైన అవగాహన ఇవ్వడం, తప్పుధోరణులను పరిశీలించి వాటిని సరిదిద్దడానికి అవసరమైన చర్యలు (Steps) తీసుకోవడం, కింది కమిటీలకు నేరుగావెళ్ళి వాటికి అవసరమైన ప్రాక్టికల్ సాయం చేయడం జరుగుటలేదు. పార్టీ ప్రజారంగాల కార్యకలాపాలను సక్రమంగా సాగించడానికి ప్లానును సిద్ధంచేయడం, కేడరు శిక్షణ మొదలగు బాధ్యతలను నిర్వహించుటలేదు.

ఇటీవల సమిష్టి కార్యాచరణ విధానాన్ని అనుసరించి కొంతవరకు పనిజరగడంవలన విశాలాంధ్ర సదస్సువంటి సమావేశం జరుపడం జిల్లాలకు కొంతవరకు ప్రాక్టికల్ సాయాన్ని అందజేయడం జరుగుతున్నప్పటికీ, తెలంగాణకమిటీ, సెక్రటేరియటులు నాయకత్వపు కమిటీలుగా పనిచేయడానికి తమ ఫంక్షనింగులో ప్రధాన మార్పులు తేవలసివున్నది.

జిల్లా తాలూకా కమిటీలు కొంతవరకు పనిచేస్తున్నప్పటికీ, పనివిధానం మాత్రం ఈ విధంగానే వున్నది. ఈ కమిటీల సభ్యులు, కార్యకర్తలు, సాధారణ పార్టీ సభ్యులు సమస్యలు వచ్చినప్పుడు తమ తమ యూనిట్లలో పెట్టి నిర్ణయాలు తీసుకొని వాటిననుసరించి పనిచేయడంలేదు. వ్యక్తులుగానే, తమకు తోచిన విధంగా పనిచేస్తున్నారు. వీరిలో కొంతమంది పార్టీలో

ఏర్పడిన సంక్షోభం ఫలితంగా పార్టీ కార్యకలాపాలలో పాల్గొన కుండా నిస్తబ్దంగా వుండి పోతున్నారు.

పార్టీలో క్రమశిక్షణ సన్నగిలి పోయింది. పై కమిటీల నిర్ణయాలను క్రిందికమిటీలు, మెజారిటీ నిర్ణయాలను మైనారిటీ, ఏ కమిటీ నిర్ణయాలను ఆ కమిటీ అమలు జరుపుటలో తగినంత శ్రద్ధ వహించడంలేదు. కమిటీలలో జరిగిన చర్చలను కమిటీ సభ్యులు కానివారికి చెప్పడం, కమిటీలను కమిటీ సభ్యులను తమ తమ కమిటీలలోగాక కమిటీ వెలుపల విమర్శించడం, విమర్శించే సందర్భంలో కఠినమైన భాషను వుపయోగించడం, విమర్శనేగాని, ఆత్మవిమర్శన లేకపోవడం, తమలో ఉన్న తప్పు అభిప్రాయాలను అనుభవంద్వారా, కమిటీల్లో చర్చలద్వారా సవరించుకోక, "తాపట్టిన కుందేటికి మూడేకాళ్ళు" అనే ధోరణిని అవలంభించడం, సొల్లువాగుడు మామూలుగా సాగిపోతున్నది.

పార్టీ సభ్యత్వమంతా సెల్లులలో నిర్మాణింపబడి లేదు. సెల్లులు ఏర్పడివున్నంతవరకు గూడా పనిచేయడంలేదు. పార్టీ సభ్యత్వాన్ని ఎప్పటికప్పుడు సమావేశంజరిపి, పార్టీ కార్యక్రమాన్ని, పై కమిటీల రాజకీయ నిర్మాణ నిర్ణయాలను రిపోర్టు చేసి వారిని కదిలించడానికి తాలూకా జిల్లా కమిటీలు పూనుకోవడంలేదు. గ్రామాలలోపార్టీసభ్యులు గ్రామతగాదాలలోను, అనవసర పంచాయతీలలోను చిక్కుకొనిపోయి సతమతమవుతూ వున్నారు. పై కమిటీ సభ్యులు గ్రామాలకు వెళ్ళినప్పుడు పార్టీ సభ్యులను సమావేశపరచి, గ్రామసమస్యలపై వారితో చర్చించి నిర్ణయం తీసుకొని పరిష్కరించడం జరుగడంలేదు. వ్యక్తి

గతంగా పరిష్కరించుతూ వుండడంవలన, ఆ పరిష్కారాలు పార్టీలో భేదాభిప్రాయాలకు దారితీస్తున్నవి. పార్టీలో కొంత పొల్లు సభ్యత్వ మున్నది. పార్టీలోకి చేర్చుకోదగు మిలిటెంటులు కూడా కొందరు మిగిలి వున్నారు.

పార్టీ ప్రజారంగాలలో పనిచేయడానికి వివిధ స్థాయిలలో కేడరుకు రాజకీయ సిద్ధాంత లీగల్ వ్యవహారాలలో శిక్షణ ఇవ్వ లేదు. దీనితో, పార్టీ నిర్మాణానికేగాక, వ్యవసాయ కూలీ సంఘాలలోనూ, కోఆపరేటివు, స్థానిక స్వపరిపాలనా సంస్థలలో పనిచేయడానికి సరిపోవు కేడరు దొరకడంలేదు. శిక్షణ లేక పోవుటవలన, కేడరు చొరవను కోల్పోయి, ప్రతి సమస్యపై పై కమిటీల సాయానికై నిరీక్షించడం జరుగుతున్నది.

ఇదేవిధంగా హోల్‌టైమర్ల విషయమైగూడా పార్టీలో ఒక స్పష్టమైన దృక్పథంలేదు. సాధారణ పార్టీ సభ్యులకు వారి వారి అవకాశాలను శక్తిసామర్థ్యాలనుబట్టి బాధ్యత లను అప్పగించి పనిచేయించవలసిన ఆవశ్యకతను గుర్తించక, ప్రతిపనికీ హోల్‌టైమర్లే కావాలనే ధోరణి ఒకటున్నది. దీని ఫలితంగా, విచక్షణారహితంగా హోల్‌టైమర్లను తీసుకో వడం, వారిని పోషించలేకనో, లేక వారికి తగిన స్థాయి శక్తి సామర్థ్యాలు లేకనో వారు కొద్దిరోజులలోనే పార్టీ ప్రజారం గాల బాధ్యతలనుంచి దూరమై పోతున్నారు. ఈ విధంగా పార్టీ, ప్రజారంగాల కార్యకలాపాలన్నీ మూలకు పడిపోతున్నవి. కేడరు కొరత ఉన్న ప్రాంతాల్లో అర్హత లేనివారిని హోల్ టైమర్లుగా తీసుకోవడం వారు తమ బాధ్యతలను నిర్వహించలేక

పోగా బాధ్యతారహితమైన చర్యలద్వారా పార్టీకొక సమస్యగా తయారు కావడం జరుగుతున్నది.

ప్రజాసంఘాల నిర్మాణంపై తగినంత కేంద్రీకరణ లేదు. పార్టీ ప్రధానశక్తిగా ఉన్న ట్రేడు యూనియనులు, రైతు సంఘంలో వాటి పలుకుబడికి తగిన సభ్యత్వం లేదు. తెలంగాణా వ్యాపితంగా చూచినప్పుడు ట్రేడుయూనియను, రైతుసంఘాలు మాత్రమే పనిచేస్తున్నవి. వాటిలో స్థానిక కమిటీలను నిర్మించి స్థానిక నాయకత్వాన్ని అభివృద్ధి చేయడంలేదు. పార్టీ కమిటీల్లో వివిధ ప్రజాసంఘాల్లో ఒక్కొక్కరు ఒకటికన్న హెచ్చు బాధ్యతల్లో ఉండడంవలన ఏ ఒక్కదానిపైన గూడా కేంద్రీకరించి నిర్మాణాన్ని గట్టిపరచలేక పోతున్నారు. ప్రజాసంఘాల కమిటీలు పనిచేయడమే తక్కువ. పని చేసినంతవరకు గూడా ప్రజాస్వామికంగా పనిచేయించడానికి శ్రద్ధతీసుకోవడం లేదు. దీనివలన, వీటికార్యకలాపాల్లో పార్టీయేతరులు హెచ్చు సంఖ్యలో ఆకర్షింపబడుట లేదు. ఆఫీసులుగూడా కొన్ని ప్రాంతాల్లోనే పనిచేస్తున్నవి. ఈ విధంగా ప్రజాసంఘాల అభివృద్ధికి వున్న లీగల్ అవకాశాలను, సమస్యలపై వస్తున్న ప్రజలకదలికను, ఉపయోగించుకోలేక పోతున్నాము. అసెంబ్లీ, మునిసిపాలిటీ, గ్రామపంచాయితీల కార్యకలాపాలకు, పార్టీ కమిటీలకు సమన్వయంలేదు.

పార్టీ పత్రికలైన న్యూఏజి, విశాలాంధ్ర, నవయుగాలను స్థానిక అభివృద్ధి విరోధకుల కుయుక్తులను బట్టబయలు చేయడానికీ, పార్టీపై సాగుతున్న దుష్ప్రచారాన్ని ఖండించడానికీ, పార్టీ కార్యకలాపాల ప్రచారానికీ తగినంతగా ఉపయోగించుకో

లేకపోతున్నాము. వాటి సక్ర్యలేపన్ను పెంచకపోవడం వలన, ప్రచారం జరుగుతున్నంత వరకైనా ప్రజల్లోకి తీసుకొని పోలేకపోతున్నాము. పార్టీ సాహిత్యాన్ని కనీసం మన కేడరైనా ఎక్కువభాగం చదవటంలేదు. పార్టీ సహిత్యాం చదవని బలహీనత పార్టీ అంతటా ఉంది.

పార్టీ సాహిత్యపు అమ్మకం చాలా తక్కువ. పార్టీ యూనిట్లు అమ్మిన సాహిత్యపు డబ్బు పార్టీ సెంటరుకు చేరడం లేదు.

పార్టీ ఆర్థికస్థితి చాలా క్లిష్టంగా ఉండడంవలన ఒక రాజకీయ సమస్యగా తయారైంది. కమిటీలకు బడ్జటులు లేవు. పార్టీసభ్యత్వపు రుసుము, పార్టీ సభ్యులనుంచి లెవీలను వారి ఆదాయాల నుంచి వసూలుచేయడం, సానుభూతిపరులనుంచి చందాలను పోగుచేయడం చాలా తక్కువ. డబ్బుకోసం పార్టీ అంతా కదలి ప్రజలనుంచి వసూలుచేసే చందాలపై గాక, వ్యక్తులపైనా, వ్యక్తులు పోగుచేసే డబ్బుపైనా ఆధారపడడం జరుగుచున్నది. పేదకుటుంబాలనుంచి వచ్చినవారు హోల్ టైమర్లుగా ఉండడం సాధ్యపడనిరూపంలో కూడా ఈ సమస్య ఎదుర్కొంటున్నది.

పార్టీలో నేటి పనిపద్ధతి చాలా లోపభూయిష్టంగా ఉన్నది. కమిటీలు సమావేశాలకు ఎవసరమైన సన్నాహాలు చేయడమనేదిఉండదు. ప్లానుప్రకారం పనిసాగించేధోరణితక్కువ. సమావేశాల్లో ఎన్నో సమస్యలను ఎజండాలో చేర్చి వాటిలో ఏది ముఖ్యమో ఏదికాదో తేల్చుకోలేక వాటిని అసమగ్రంగా చర్చించి నిర్ణయాలు తీసుకోవడం, వేటినీ అమలు జరుపక

పోవడం తుదకు నిరుత్సాహం వ్యాపించడమూ జరుగుచున్నది. ఇదే విధంగా కమిటీలకున్న అవకాశాలను సద్వినియోగం చేసుకొని ఏ ప్రాంతంలో కేంద్రీకరించి పనిచేయాలి, ఏ ప్రాంతంలో పరిమితమైన సంబంధాలు కలిగిఉండాలనే విచక్షణ లేకుండా అన్ని ప్రాంతాల్లో పనిచేయాలని పరుగెత్తడం జరుగుతున్నది. కార్యకర్తలు, సాధారణ పార్టీ సభ్యులు, గ్రామ సమస్యలను రాజకీయ దృష్టితో చూచి, ఉద్యమ నిర్మాణానికి ఏవి అవుసరమో ఏవి కాదో నిర్ణయించుకోక గ్రామపెద్దల మాదిరిగా పంచాయితీ పరిష్కారాలు సాగించుతున్నారు. దీనితో రాజకీయ సమస్యలపై, ప్రజాఉద్యమ నిర్మాణానికి ఉపయోగపడే సమస్యలపై కేంద్రీకరించ వీలు లేకపోతున్నది.

సమస్య నెత్తిమీదికి వచ్చినప్పుడు తీసుకొని పనిచేసి తర్వాత మానుకొని, తిరిగి సమస్య వచ్చినప్పుడే కదలడం, చేసిన కృషికి, ప్రజల కదలికకు, నిర్మాణ స్వరూప మివ్వకపోవడం, ఏ ఒక్క రంగాన్నో పట్టుకొని, ప్రజాజీవితానికి సంబంధించిన ఇతర రంగాలలో ప్రవేశించకపోవడం వలన పార్టీ కార్యకలాపాల్లో ఎక్కడికక్కడ బ్రేకులు పడడం, పార్టీపని ప్రజల్లో కొంత భాగానికే పరిమితం కావడం జరుగుతున్నది.

5. దీని అర్థం ఎక్కడా ఏరూపంలోనూ పని జరుగడం లేదనిగాని, ఏ కామ్రేడ్ పనిచేయడం లేదనికాని కాదు. కామ్రేడ్స్ చేసే పనికి ఒక రాజకీయమార్గం (Direction) లేకుండాపోవడం, ఉద్యమ స్వరూప మేర్పడకపోవడం, తెలంగాణా వ్యాపిత స్వభావం లేకుండుటము జరుగుచున్నది.

ఈ పరిస్థితులు తెలంగాణా అంతటా ఒకే విధంగా లేవు. పరిస్థితుల తీవ్రతలో తరతమ భేదాలున్న ప్రాంతాలున్నవి. కొన్ని సమస్యలు కొన్ని ప్రాంతాల్లోనూ, మరికొన్ని సమస్యలు వేరుప్రాంతాల్లోనూ ఉన్నవి. అయినా స్థూలంగా చూచినప్పుడు తెలంగాణాలో పార్టీస్థితి పై విధంగా వున్నది.

6. ఈ పరిస్థితి ఏర్పడడానికి ప్రధానకారణం, ఒకవైపున, పార్టీ నూతన పరిస్థితుల కనుగుణ్యమైన ఎత్తుగడలను రూపొందు కోడంలో విఫలత చెందటం, మరోవైపున పార్టీ నిర్మాణంలో గ్రూపు మనస్తత్వం వ్యాపించడం అయిఉంది. గ్రూపుమనస్తత్వం పార్టీ కార్యకలాపాలన్నిటిలోనూ ప్రతిబింబించుతూ వున్నది. కమిటీల నిర్మాణంలోనూ, కమిటీలను పనిచేయించడంలోనూ, చర్చల సందర్భంలో వెలిబుచ్చే అభిప్రాయాల్లోనూ, విమర్శన, ఆత్మవిమర్శనలోనూ, హోల్‌టైమర్ల నియామకంలోనూ, ఒక్కమాటలో చెప్పాలంటే పార్టీ కార్యకలాపాలకు సంబంధించిన ప్రతి అంశంలోనూ, ఈ మనస్తత్వం పనిచేస్తూ పరిస్థితులను వాస్తవిక దృష్టితో పరిశీలించడానికి, సమస్యలను వాటి మంచి చెడుగులను (Merits) బట్టి ఆలోచించడానికీ, ప్రజా సమస్యలను తీసుకొని సమిష్టిగా పనిచేయడానికీ ఆటంకంగా తయారైంది. ఈ విధంగా దీని వలన పార్టీ కార్యకలాపాలు స్తంభించి పోయినవి.

ఈ మనస్తత్వం పైనుంచి క్రిందిదాకా, పార్టీ మొత్తంలో తర తమ స్థాయి భేదాలతో, వివిధ రూపాలలో పని చేస్తున్నది. దీనివలన పార్టీయే నామరూపాలు లేకుండా పోయే ప్రమాదమున్నదని పార్టీ నాయకత్వమూ సాధారణ సభ్యులంతా

క్రమంగా గుర్తించుతున్నారు. ఇది అభినందించవలసినవిషయమే. అంతమాత్రాన ఈ మన స్తత్వం పార్టీలో లేకుండా పోయిందని భావిస్తే, దీనిని నిర్మూలించడానికి చేయవలసిన కృషి వెనుకపడి పోతుంది. కనుక దీనిని నామరూపాలు లేకుండా చేసినప్పుడే పార్టీ ఐక్యమై బలమైన పార్టీగా అభివృద్ధి పొందుతుంది.

ఈ పరిస్థితి ఏర్పడడానికి ప్రధాన బాధ్యత తెలంగాణా కమిటీదే. తెలంగాణా కమిటీ ఎన్నికల తర్వాత వచ్చిన కొత్తమార్పులకు అనుగుణ్యమైన కార్యక్రమాన్ని పార్టీ యూనిట్లకు అందించడంలో విఫలమైంది. పార్టీలో వ్యాపించిన గ్రూపు మన స్తత్వానికి వ్యతిరేకంగా పోరాడి దానిని పోగొట్ట లేక పోయింది. దీని ఫలితంగానే పార్టీ నిర్మాణమంతా చిందర వందరై పోయింది.

7. పార్టీ ఉనికికే ప్రమాదంగా తయారైన ఈ గ్రూపు మన స్తత్వంతో బాటు పార్టీలో కొన్ని తప్పు అభిప్రాయాలు అమలులో ఉన్నవి. వాటిని దూరం చేయనంతవరకు పార్టీని సమస్యలపై కదిలించడం, పార్టీలో ఫారాలను పునరుద్ధరించడం అసంభవము.

ఈ అభిప్రాయాలలో మొదటిది పార్టీలో గతానికి సంబంధించిన అభిప్రాయభేదాలు పరిష్కారం కానిదే తక్షణ సమస్యలపై పార్టీ కమిటీలు కదిలి పనిచేయడమనేది అసంభవమనేది.

ఈ అభిప్రాయ భేదాలు పరిష్కారం కానంతవరకు, పార్టీ కార్యక్రమాన్ని అనుసరించి ప్రజలలో పనిచేయడం సాధ్యం కాదనే దీని అర్థం.

పార్టీలో గతాన్ని గురించి అభిప్రాయభేదాలున్న మాట నిజం. పార్టీలో ఐక్యత నెలకొనడానికి వీటిని సమగ్రంగా చర్చించడం, ఏకాభిప్రాయానికి రావడం ఎంతైనా అవసరం. దీనితో బాటు పార్టీలో నేడు కార్యక్రమంపై, ప్రజల నెదుర్కొనే అనేక ముఖ్య సమస్యలపై ఏకాభిప్రాయమున్నది. ఏ సమస్యపైనైనా అభిప్రాయ భేదమొస్తే దానిని పార్టీ కార్యక్రమాన్ని పునాదిగా జేసికొని పరిష్కరించుకోడానికి అవకాశమున్నది. ఇలాంటి పరిస్థితులలో, ఏకీభావమున్న సమస్యలపై కమిటీలు కదలి పనిచేయడం సాధ్యం కాదనడం కన్న అవివేక మింకొకటి లేదు. ఈ విధంగా అభిప్రాయ భేదాలు పరిష్కారం కానంత వరకు ప్రజాసమస్యలమీద పనిచేయకుంటే, ఈలోగా పార్టీ ప్రజలనుంచి దూరమయిపోయే ప్రమాదముంటుందని గూడా గుర్తించాలి.

గతానికి సంబంధించిన ఎన్ని భేదాభిప్రాయాలున్నా, అవి పరిష్కారమయినా, లేకున్నా, పార్టీకొక కార్యక్రమమున్నది. దానిని ప్రతిపార్టీ యూనిటు తమపరిస్థితుల కన్వయించుకొని అమలుజరుపాలి. వాస్తవమేమంటే పార్టీ కార్యక్రమాన్ననుసరించి పార్టీయూనిట్లు తక్షణ సమస్యలపై కదిలి పనిచేయడం ప్రారంభించితే, దీనినుంచి వచ్చే అనుభవాల వెలుగులో గతాన్ని పరిశీలించి, ఏకాభిప్రాయానికి రావడానికి అవకాశముంటుంది. కనుక పై అభిప్రాయం తప్పు, పార్టీ దీనిని నిరాకరించాలి.

ఇదే విధమైన మరొక తప్పు అభిప్రాయ మేమంటే: గతానికీ, ప్రస్తుతానికీ సంబంధించిన ప్రధాన సమస్యలపై

పార్టీలో ఐక్యత ఏర్పడనిదే పార్టీ ఫారాలను పాటించడం సాధ్యంకాని పని అని.

దీని అర్థం, పార్టీలో ఆంతరంగిక పోరాటం సాగుతున్నంతకాలం క్రమశిక్షణ అనేది ఉండవలసిన పనిలేదనే. ఇది పార్టీ ఆంతరంగిక పోరాట సూత్రాలకు పూర్తిగా వ్యతిరేకం. క్రమబద్ధంగా పార్టీ నిర్మాణ సూత్రాలననుసరించి అభిప్రాయ భేదాలను చర్చించినప్పుడే అవి సులభంగా పరిష్కారమవుతాయి. పార్టీ ఆంతరంగిక పోరాటం పార్టీలో ఐక్యతకు, పార్టీ అభివృద్ధికి తోడ్పడుతుంది.

ప్రజల నెదుర్కొంటున్న తక్షణ సమస్యలపై అభిప్రాయ భేదాలువచ్చినప్పటికీ మెజారిటీ నిర్ణయాలు తీసుకొని అమలు జరిగినప్పుడే పార్టీ ప్రజలకు నాయకత్వం వహించగలుగుతుంది. ఈ విధంగా పార్టీ ఫారాలనుపాటించడం, పార్టీ ఐక్యతను సాధించడానికి కృషిచేసే అన్ని దశల్లోనూ అవసరమవుతుంది.

పార్టీలో ఒకరు శిక్షణారాహిత్యంగా ప్రవర్తిస్తే తక్కిన వారు కూడా అదే విధంగా వ్యవహరించటం తప్పనిసరి అనే మరోతప్పు అభిప్రాయ మున్నది. దీనివలన పార్టీలో అరాచకం బయలుదేరి పార్టీ విచ్ఛిన్న మవుతుందనడం స్పష్టం.

పార్టీలో సాధారణ పరిస్థితుల్లో క్రమశిక్షణ ఎంత అవసరమో, తీవ్ర అభిప్రాయ భేదాలేర్పడినప్పుడు, వందరెట్లు హెచ్చుగా అవసర మవుతుంది. కనుక ఇలాంటి పరిస్థితుల్లో శిక్షణారాహిత్యాన్ని, అంతాక్రమశిక్షణతో పనిచేయడంద్వారా ఎదుర్కోవాలి.

ఈ తప్పు అభిప్రాయాలన్నీ అపసవ్యపు పార్టీ అంతరంగిక పోరాటము (Un - Principled Inner.Party Struggle) యొక్క లక్షణాలే. ఇవి పార్టీలో నిరాశా, నిస్పృహలను, నిస్తబ్దతను వ్యాపింపజేయడానికి, గ్రూపు మనస్తత్వాన్ని ప్రోత్సహించడానికీ తోడ్పడుతూ ఉన్నవి. పార్టీలో ఐక్యతను నెలకొల్పి పార్టీ యూనిట్లను కదిలించి పనిచేయించడానికి ఇవి పెద్ద ఆటంకంగా తయారైనవి. పార్టీ యూనిట్లన్నీ యీ అభిప్రాయాలను దూరం చేయడానికి తీవ్రమైన కృషిచేయాలి.

ఇటీవల పార్టీస్థితి కొంత చక్కబడుతున్నది. కామ్రేడ్స్ పార్టీలో ఐక్యత నెలకొల్పవలసిన అవసరాన్ని, పార్టీని కదిలించి ప్రజాఉద్యమ నిర్మాణంవైపు వెళ్ళవలసిన అవసరాన్ని ఇదివరకు కన్నా హెచ్చుగా గుర్తించి పనిచేస్తున్నారు. ఇటీవల జరిగిన జిల్లా, తాలూకా పార్టీ మహాసభలు, ఈ దృష్టిలో జరిపినంత వరకు పార్టీని బలపరచడానికి తోడ్పడినవి. నేడు పార్టీలో తక్షణ ముఖ్య సమస్యలపై —విశాలాంధ్ర, తెలంగాణ సమస్య, వ్యవసాయకూలీ సంఘాలు, పి. డి. ఎఫ్. మొ - చాలావరకు ఏకాభిప్రాయ మున్నది. క్రమంగా పార్టీ యూనిట్లలో సమస్యలమీద కదిలి పనిచేయగలమని విశ్వాస మేర్పడుతున్నది. ఈ విధంగా పార్టీ పరిస్థితి ఇదివరకుకన్నా మెరుగుగానే ఉన్నదని స్పష్టంగా కానవస్తున్నది. అయినా పార్టీ నిర్మాణంలో పై బలహీనతలను తొలగించనంతవరకు ప్రధాన మార్పురాదని, అలాంటి మార్పు ఇంకా రాలేదని దానికై ప్రత్యేక కృషి జరపాలని పార్టీ యూనిట్లు గుర్తించాలి.

# తక్షణ కర్తవ్యాలు

పార్టీ తక్షణ రాజకీయ ఆర్థిక రాజకీయ సమస్యలపై ప్రజలకు నాయకత్వం వహించ గలగడానికి, పార్టీకున్న రాజకీయ పలుకుబడి నిర్మాణబలాల మధ్యనఉన్న అంతరాన్ని పోగొట్టడానికి ఈ క్రింది కర్తవ్యాలను నిర్వహించడం అవసరం.

## (i) పార్టీ ఫారాలను పునరుద్ధరించాలి

పార్టీ సభ్యులు, పార్టీ యూనిట్లు, తమ రోజువారీ కార్యకలాపాల్లో పార్టీ నియమావళిలోను, కేంద్ర కమిటీ నిర్మాణ తీర్మానంలోను ఉన్న నిబంధనలను బేషరతుగా పాటించాలి. అప్పుడే మన పార్టీ విప్లవపార్టీగా అభివృద్ధి అవుతుంది. పై కమిటీ నిర్ణయాలను క్రింది కమిటీలు, మెజారిటీ నిర్ణయాలను మైనారిటీ అమలు జరుపాలి. పార్టీ ఐక్యతను కాపాడడానికి తమ తమ బాధ్యతలను ఏమరుపాటు లేకుండా నిర్వర్తించటం అత్యావసరం. దీని ప్రాధాన్యతను గుర్తింపజేస్తూ సాధారణ పార్టీ సభ్యులకు, కేడరుకు, పార్టీ నిబంధనావళి, నిర్మాణ తీర్మానాన్ని వివరించి అర్థం చేయించాలి. పార్టీ యూనిట్లు తమ సభ్యులు పార్టీ ఫారాలను పాటించే విషయమై పై యూనిట్లు క్రిందియూనిట్లపై అవసరమైన చెకపు చేస్తూఉండాలి.

తెలంగాణాకమిటీ, సాధారణ పార్టీ సభ్యులు, కేడరు, పార్టీ యూనిట్లు, తమ రోజువారీ కార్యకలాపాలను, ఈ విధంగా సాగించడానికి అవసరమైన వివరణలు, సూచనలను సిద్ధంచేసి పార్టీ యూనిట్లకు అందించాలి. వాటి ననుసరించి పని జరుగునట్లు చూడాలి.

## (ii) పార్టీ యూనిట్లు సమిష్టి కార్యాచరణ విధానా న్ననుసరించి పనిచేయాలి

తెలంగాణా కమిటీతోసహా అన్ని పార్టీ యూనిట్లు నేటి కార్యాచరణ విధానంలో ఆమూలాగ్రమైన మార్పుచేయాలి. వ్యక్తి, గ్రూపు కార్యాచరణ విధానానికి స్వస్తి చెప్పాలి. ఒక పార్టీ యూనిటులోఉన్న సభ్యులేగాక, పార్టీ యూనిట్లన్నీ సమిష్టిగా పనిచేసినప్పుడే, సమిష్టి కార్యాచరణ విధానం సంపూర్ణంగా అమల్లోకి వస్తుంది.

ప్రతి పార్టీ సభ్యుడు తన యూనిటు నిర్ణయాల ననుసరించి పనిచేయాలి. పార్టీ యూనిటు, సమస్యలపై సరైన నిర్ణయానికి రావడానికి, సభ్యులంతా తమ తమ అనుభవాలను అందించి తోడ్పడాలి. ఇదేవిధంగా పై కమిటీలు క్రింది కమిటీలకు, క్రింది కమిటీలు, యూనిట్లు పై కమిటీలకు తోడ్పడుతూ ఉండాలి. ఈ విధంగా జరిగే నిర్ణయాలు పార్టీమొత్తం అనుభవానికి ప్రతిబింబంగా ఉంటాయి.

ఒకసారి నిర్ణయం తీసుకొన్నతర్వాత ఆ నిర్ణయాన్ని అమలు జరుపడానికి, యూనిటు సమిష్టిగాను, యూనిటు సభ్యులు వ్యక్తిగతంగాను బాధ్యత వహించాలి. బాధ్యతను నెత్తినవేసుకొని పనిచేసే కొందరిమీద నిర్ణయాలను అమలు జరిపే బాధ్యతను పడవేసి, మిగతావారు పట్టీపట్టనట్లుగా ఉండే ధోరణి పోవాలి.

ఈ విధంగా సమిష్టి పని విధానాన్ని అనుసరించి పని జరిగినప్పుడే పార్టీయొక్క శక్తి నంతటినీ ప్రజాసమస్యలు తీసు

కొని పనిచేసి, తెలంగాణా వ్యాపితంగా ప్రజలను సమీకరించ డానికి, బలమైన ప్రజా ఉద్యమ నిర్మాణానికి అవకాశా లేర్పడు తాయి.

### (iii) కమిటీల ఫంక్షనింగురూల్సు

తెలంగాణా కమిటీ, జిల్లా తాలూకా కమిటీలు, ప్రస్తుత కార్యాచరణ విధానంలో ఆమూలాగ్రంగా మార్పు తేవడానికి, సమిష్టి కార్యాచరణ విధానాన్ననుసరించి పనిచేయడానికి కొన్ని నిర్దిష్టమైన నిబంధనలు అవసరం. ఇవి సహజంగా కేంద్ర కమిటీ నిర్మాణ తీర్మానంలో, కేంద్ర రాష్ట్ర, జిల్లా కమిటీలు పనిచేయ డానికి వీలుగా సిద్ధంచేసిన నిబంధనల ననుసరించి ఈ క్రింది విధంగా ఉండాలి:

### తెలంగాణా కమిటీ, సెక్రటేరియటుల బాధ్యతలు

1. తెలంగాణా కమిటీ, సెక్రటేరియటుల బాధ్యతలు ఈ క్రింది విధంగా వుండాలి :

(1) కేంద్ర కమిటీ నిర్ణయాలను తెలంగాణాకు అన్వ యించి అమలు జరుపాలి. తెలంగాణా అంతటికీ వర్తించే రాజ కీయ, ప్రజా ప్రాముఖ్యత గల సమస్యలపైన నిర్ణయాలు తీసు కొని, రాజకీయంగా నాయకత్వం వహించాలి. పార్టీ కేడరుకు శిక్షణ నివ్వాలి. పత్రికను నడుపాలి.

(2) అసెంబ్లీ వ్యవహారాలను చూడాలి.

(3) కేంద్రకమిటీ పాలసీని వివిధరంగాలకు అన్వయింప జేసి ప్రజా కార్యకలాపాలను నడిపించాలి.

(4) తెలంగాణా ప్రాధాన్యతగల పోరాటాలను ఉద్యమాలను సమీక్షించి, వాటినుంచి సరైన గుణపాఠాలను తీయాలి.

(5) జిల్లాలలోని పరిస్థితులను స్వయంగా పరిశీలించి జిల్లా కమిటీలకు నిర్దిష్టమైన (concrete) ప్రాక్టికల్ నాయకత్వం వహించాలి.

తెలంగాణా కమిటీ సెక్రటేరియటుల పనుల మధ్యనే ఉన్న గందరగోళాన్ని తొలగించడానికి ఈ రెండిటి పనులను విడివిడిగా నిర్వచించడం అవసరం. అవి ఈ క్రింది విధంగా ఉండాలి:

## తె లం గా ణా క మి టీ

(1) తెలంగాణా కమిటీ ప్రధానమైనవీ, తెలంగాణా వ్యాపిత స్వభావం కలిగిన ముఖ్యమైన రాజకీయ, నిర్మాణ, ప్రజా సమస్యలపై పనిచేయాలి.

(2) కమిటీ సాధారణంగా రెండు నెలలకొకసారి సమావేశం కావాలి. ఏ పరిస్థితుల్లోనూ, మూడు నెలలకు మించకూడదు.

(3) కమిటీ సమావేశాలకు కమిటీ సభ్యులంతా హాజరు కావాలి. ఎవరైనా హాజరు కాజాలనిచో మొదలే తెలుపాలి. తెలుపకుండా గైరుహాజరయిన వారినుంచి సంజాయిషీ తీసుకోవాలి. వరుసగా మూడు సమావేశాలకు హాజరు కాని సభ్యులను కమిటీనుంచి తొలగించాలి.

(4) కమిటీ సమావేశపు కోరం కోసం నూటికి 60 మంది సభ్యులు హాజరు కావాలి.

(5) సెక్రటేరియటు, కమిటీ సమావేశంలో గత సమావేశంలో చేయబడిన నిర్ణయాలు ఎంతవరకు అమలు జరిగినవీ, తామెంతవరకు అమలు జరిపినదీ, కొత్తగా తీసుకున్న నిర్ణయా లేమిటి మొదలగు అంశాలపై వ్రాత పూర్వకమైన రిపోర్టు నివ్వాలి. కమిటీ రిపోర్టును చర్చించాలి.

(6) సమావేశంలో వ్రాతపూర్వకమైన ముసాయిదా తీర్మానాలను వ్రాసిపెట్టాలి. తీర్మానాలపై చర్చలు వ్యవహార సరళిలో (Business Like) సాగిపోవాలి.

(7) కమిటీ అమలు జరుపగల నిర్ణయాలనే చేయాలి. నిర్ణయాలను అమలు జరుపడానికి కాలపరిమితిని గూడా నిర్ణయించాలి.

(8) సమావేశపు తీర్మానాలను, ఉంటే భేదాభిప్రాయా లతో సహా వ్రాసి, సమావేశపు అంగీకారాన్ని పొందాలి.

(9) కమిటీ సమావేశంలో చేసిన నిర్ణయాలను వాటికి అవసరమైన వివరణతో సహా క్రింది కమిటీలకు, పై కమిటీలకు పంపించాలి.

(10) కమిటీ సమావేశం ముగిసిన తర్వాత, కమిటీ యొక్క రాజకీయ నిర్మాణ రిపోర్టును కేంద్ర కమిటీకి పంపించాలి.

(11) వివిధరంగాలలో రోజువారీ వ్యవహారాలనుచూస్తూ వుండటంకోసం, అందులో వస్తున్న ప్రధాన సమస్యలను సమగ్రంగా పరిశీలన జరిపి ఆయారంగాలకు వర్తింపజేయుట కొరకు వాటిని పార్టీ కమిటీదృష్టికి తీసుకొనివచ్చి తగునిర్ణయాలు

చేయించటంకోసం, ముఖ్యమైన రంగాలకు సబ్ కమిటీలను ఏర్పర్చాలి. ఈ కమిటీలు ప్రధానంగా ఆయా రంగాలు చూస్తూ కేంద్రంలో పనిచేసే తెలంగాణా కమిటీ సభ్యులతో కూడి వుంటాయి. ముఖ్యసమస్యమీద యివి స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకోకుండా తమ సూచనలను కమిటీదృష్టికి తీసుకొనివచ్చి కమిటీలోనే తగు నిర్ణయాలు జరుగుటకు తోడ్పడాలి. వీటికి నేరుగా జిల్లాలలో ఉన్న సబ్ కమిటీలతో సంబంధముండదు. కమిటీ నిర్ణయాలు కానివాటిని ఆయా ప్రజారంగాల్లో సబ్ కమిటీ సభ్యులు తమ స్వంతసూచనలుగానే పెట్టుతారు.

## సెక్రటేరియటు

(1) తెలంగాణా కమిటీ చేసిన నిర్ణయాలను అమలు జరుపుటకు అవసరమైన చర్యలు తీసుకోవాలి. అవసరమైనప్పుడు వాటిని వ్యాఖ్యానించ వచ్చును. కమిటీ సమావేశం అయ్యే లోగా, ఏమైనా సమస్యలు వచ్చినట్లయితే, వాటిని సెక్రటేరి యటు చర్చించి, పరిస్థితుల అవసరాన్నిబట్టి నిర్ణయాలు తీసు కొని అమలు జరుపవచ్చును. ఆ తరువాత సాధ్యమైనంత త్వరలో తెలంగాణా కమిటీని సమావేశపరచి ఆ సమస్యను క్షుణ్ణంగా చర్చించి కమిటీ ఆమోదాన్ని పొందాలి.

(2) సెక్రటేరియటు సభ్యులందరూ తెలంగాణా కేంద్రం యొక్క హోల్ టైమర్లుగా ఉండాలి. వారు జిల్లా కార్యదర్శులు గాను, జిల్లా సెక్రటేరియటు సభ్యులుగాను పనిచేయగూడదు.

(3) సెక్రటేరియటు సమావేశాలు కనీసం మూడు వారాలకొక సారైనా జరుగాలి. కోరంకొరకు, నూటికి 75

వంతులు సభ్యులుండాలి. సమావేశంలో కార్యదర్శి గత సమావేశంలో తీసుకోబడిన నిర్ణయాలు ఎలా అమలు జరిగిందీ కొత్తగా తీసుకొనబోయే నిర్ణయాలపైనా రిపోర్టు ఇవ్వాలి.

(4) సెక్రటేరియటు పూర్తి సమావేశాలు జరిగే మధ్యకాలంలో, అవసరమైనప్పుడు, ఆఫీసుకు అందుబాటులో ఉన్న సభ్యుల సమావేశాలు జరిపి రాజకీయ నిర్మాణ సమస్యలపై చర్చించవచ్చును. కాని సెక్రటేరియటు తరఫున ఏ ముఖ్యమైన నిర్ణయమూ చేయరాదు. అట్టి సమస్యలపై నిర్ణయాలు తీసుకోవలసి వస్తే, వెంటనే సెక్రటేరియటు సమావేశాన్ని ఏర్పాటు చేయాలి.

(5) పని సౌలభ్యంకోసం, సెక్రటేరియటు సభ్యులు తెలంగాణా కమిటీ నిర్వహించవలసిన వివిధరంగాలను విభజించుకోవాలి. జిల్లాల పనులను చూడటానికై ఇలాంటి విభజన అవసరం లేదు.

(6) ప్రతిసెక్రటేరియటు, కమిటీ సమావేశానికిముందు పూర్తిసన్నాహాలు చేసుకోవాలి. ఎజెండాను ముందే పంపాలి.

— ప్రతిసమావేశంలోనూ కార్యదర్శి లేక సెక్రటేరియట్ గత సమావేశం తర్వాత జరిగిన పనిని గురించి రిపోర్టునివ్వాలి. ఈ రిపోర్టులో గతంలో తీసుకున్న నిర్ణయాలు ఎంత వరకు అమలు జరిగినవి. అమలు జరగకపోతే కారణాలు వివరించాలి.

— చర్చించ వలసిన హంశాల గురించి సమావేశానికి ముందుగానే ముసాయిదాలను తయారుచేయాలి. అప్పటి

కప్పుడు సమస్యమీద ఊకదంపు ఉపన్యాసలు యిచ్చేపద్ధతి పోవాలి.

— ప్రతి సమావేశంలోనూ ప్రతి దానిని గురించి చర్చించి నిర్ణయాలు తీసుకునే పద్ధతిగాక అప్పటికి ఉద్యమా న్నెదుర్కుంటున్న నిర్దిష్టమైన సమస్యల్ని చర్చించి మనకున్న పరిమితులను, శక్తిని గణనకు తీసుకొని నిర్ణయాలు తీసుకో వాలి.

## జిల్లా, తాలూకా కమిటీలు

జిల్లా కమిటీలు సెక్రటేరియట్లు, తాలూకా కమిటీలు ఇంచుమించు ఇదే పని విధానాన్ని అవలంబించాలి. జిల్లా కమిటీలు జిల్లాకు రాజకీయంగా నాయకత్వం వహించాలి; ప్రజా కార్యకలాపాలను సమన్వయంచేయాలి. ప్రాథమిక యూనిట్లకు నిర్మాణరీత్యా నాయకత్వం వహించాలి.

1. బలంగాఉన్న జిల్లా కమిటీలకు మాత్రమే సెక్రటేరి యట్లు ఉండాలి.

2. కొన్ని ముఖ్యమైన తాలూకాలు మినహాయించి తాలూకా కమిటీలకు సెక్రటేరియట్లు అవసరంలేదు. సెక్ర టేరియటులులేని తాలూకా కమిటీలు సహాయ కార్యదర్శులను ఎన్నుకోవచ్చును.

3. జిల్లా, తాలూకా కమిటీల సెక్రటరీలు, ముఖ్య మయిన రంగంయొక్క బాధ్యత తీసుకోగూడదు. ప్రధానంగా పార్టీ నిర్మాణాన్ని చూడాలి.

4. జిల్లా కమిటీ సమావేశాలు రెండు నెలలకొకసారి జరుపబడాలి. సెక్రటేరియట్ లేని జిల్లా కమిటీలు 45 దినముల కొకసారి సమావేశాలు జరుపవచ్చును.

(5) తాలూకాకమిటీలు నెలకొకసారిసమావేశమవాలి.

(6) సమావేశాల కోరం ఈ క్రింది విధంగా వుండాలి.

1. జిల్లా కమిటీ 100 కి 50 వంతులు.

2. సెక్రటేరియట్ 100 కి 60 వంతులు.

3. తాలూకా కమిటీ 100 కి 40 వంతులు

జిల్లా, తాలూకాలలో వెంటనే అంతా చుట్టపెట్టాలనే తత్వాన్ని విడనాడి మన శక్తిసామర్థ్యాలను గణనకు తీసుకొని కార్యక్రమాన్ని నిర్ణయించుకోవాలి. ముఖ్యమైన, కీలకమైన, కేంద్రాలలో కేంద్రీకరించి పనిచేయాలి. కాంపెయిన్సు సందర్భంలో మిగతా గ్రామాలను, ప్రాంతాలను అందుకొనుటకు (Cover చేయుటకు) ప్రయత్నం చేయాలి.

తక్కిన తెలంగాణా కమిటీ నిబంధనలన్నీ జిల్లా తాలూకా కమిటీలకు వర్తించుతాయి.

## (IV) పార్టీ సభ్యత్వం

పార్టీ సభ్యులను రిక్రూటు చేయడంలో తీసుకోవలసిన జాగ్రత్తలు, పార్టీ సభ్యుల విధులను, హక్కులను వివరించి వాటిని అమలుజరుగునట్లు చేయడం గూడా పార్టీ నిర్మాణాన్ని బలపరచడానికి అవుసరం.

## పార్టీ సభ్యత్వపు రిక్రూటుమెంటు

ఇకముందు పార్టీలోకి తీసుకోనబోయే సభ్యులకు పార్టీ నిబంధనావళి ననుసరించి, అవసరమైన క్యాండిడేటు సభ్యత్వపు కాలం పూర్తిఅయిన తర్వాతనే పార్టీలోకితీసుకోవాలి. వారికి విధిగా పార్టీ కార్యక్రమం నిబంధనావళిని వివరించి చెప్పి పార్టీ సభ్యత్వ ప్రమాణం చేయించాలి.

పార్టీలోకి పేదవర్గాల్లోనుంచి వచ్చేవారిని హెచ్చు సంఖ్యలో చేర్చుకోడానికి ప్రత్యేక శ్రద్ధవహించాలి. సమస్యలపై ఉద్యమాలను నడుపుతున్న సందర్భంలో వచ్చే మిలిటెంటులలో మెరకల్లాంటివారిని ఎప్పటికప్పుడు పార్టీలో చేర్చుకుంటూ సాగిపోతేనే ఇది సాధ్యపడుతుంది.

## పార్టి సభ్యుల విధులు, హక్కులు

1. విధులు: ప్రతి పార్టీసభ్యుడు, సభ్యురాలు తన చైతన్యాన్ని పెంపుచేసుకోడానికి, మార్క్సిస్టు ప్రధాన సూత్రాలను అర్థంచేసుకోడానికి ప్రయత్నించాలి.

2. పార్టీ క్రమశిక్షణను పాటించాలి. పార్టీ ఆంతరంగిక జీవితంలోనూ, ప్రజా కార్యకలాపాల్లోనూ చురుకుగా పాల్గొనాలి. పార్టీ నిర్ణయాలను, విధానాలను అమలుజరుపాలి. పార్టీ ప్రయోజనాలకు నష్టదాయకమయిన వాటిని ఎదుర్కోవాలి.

3. ప్రజలకు సేవచేయాలి. పార్టీ ప్రజల మధ్యన గల సంబంధాలను దిట్టపరచాలి. ప్రజల అవసరాలను తెలుసుకొని వాటిని గూర్చి పైకమిటీలకు తెలుపాలి. ప్రజలకు పార్టీ పాలసీని వివరించాలి.

4. ప్రజా కార్యకలాపాలను సాగించుటలో ఆదర్శ ప్రాయంగా ఉండాలి.

1. హక్కులు: ప్రతిపార్టీ సభ్యుడు సభ్యురాలు, పార్టీ పాలసీని అమలు జరిపే సందర్భంలో, పార్టీసమావేశాల్లోనూ, పత్రికల్లో సమస్యలపై జరిగే చర్చల్లో స్వేచ్ఛగా పూర్తిగా పాల్గొనవచ్చును.

2. పార్టీలో ఎవరినైనా ఎన్నుకోడానికి, తాను ఎన్నుకోబడడానికి హక్కు ఉంటుంది.

3. కేంద్ర కమిటీతోసహా ఏ కమిటీకైనా తన సూచనలను, అభిప్రాయాలను పంపవచ్చును.

4. ఏ పార్టీ కార్యకర్తనైనా, పార్టీ సమావేశాల్లో విమర్శించవచ్చును.

వీటి ననుసరించి ప్రతిపార్టీ సభ్యుడు, తన బాధ్యతలను నిర్వహించుతూ హక్కులను ఉపయోగించుకొంటే పార్టీ నిర్మాణం బలపడుతూ, సాధారణ పార్టీ సభ్యుల్లో చొరవవృద్ధి అవుతుంది. పైకమిటీ సభ్యులు వీటిని అనుసరించుతూ ఆదర్శ ప్రాయంగా ఉండాలి.

## (V) సెల్లు నిర్మాణం-పని విధానం

"పార్టీకి, ప్రజానీకానికి మధ్య ప్రధానమైన, సజీవమైన లింకు పార్టీ సెల్లు. పార్టీ తీసుకున్న నిర్ణయాలను నేరుగా ప్రజల్లోనికి తీసుకొనిపోయి ప్రజలను సమీకరించేది సెల్లు. సమిష్టి కార్యాచరణ విధానం, పని విభజన, సమిష్టి బాధ్యత, నిరంతరం ప్రజలతో సంబంధం అనే పునాదిపైన ఈ సెల్లు నిర్మించబడాలి.

గ్రామంలోనూ, లేక పేటలోనూవున్న పార్టీసభ్యులను, కాండిడేటు సభ్యులను, కలిపి 3 నుంచి 7 కు మించకుండా సెల్లును నిర్మించాలి. ఈ సెల్లు ఆయాగ్రామ లేక పేటలోని సమస్యలను చర్చించి పార్టీ నిర్ణయాల దృష్ట్యా వాటి నెలా పరిష్కరించాలో, ఎలా అమలు జరుపాలో నిర్ణయించుకోవాలి. ఆ నిర్ణయాలను అమలు జరపటానికి పనిని విభజించుకోవాలి. ప్రతి సెల్లు ఒక కార్యదర్శిని ఎన్నుకోవాలి. సెల్లు తీసుకునే నిర్ణయాలు అమలు జరిగేటట్లు కార్యదర్శి చూడాలి.

పట్టణాలలోనూ, స్థానికంగా అవుసరమైన గ్రామాలలోనూ వివిధరంగాలలో పనిచేసే సభ్యులు ఎక్కువమంది ఉన్న చోట, ఆయా రంగములో పనిచేసే వారిని ఒక సెల్లులో నిర్మించవచ్చు.

(ఉ. మహిళాసెల్లు, యువజనసెల్లు, ట్రేడ్ యూనియన్ సెల్లు మొ॥)

1. పార్టీ సభ్యులందరినీ సెల్లుల్లో పెట్టి పనిచేయించాలి. పార్టీ సభ్యులను, కాండిడేట్లను సానుభూతిపరులను కదలించడానికి తాత్కాలికంగా ఫిర్కా జనరల్ బాడీ సమావేశాలను జరుపాలి. నేడు కదిలి పనిచేస్తున్న మిలిటెంట్లలో పార్టీ సభ్యత్వపు అర్హతలున్నవారికి పార్టీ సభ్యత్వ మివ్వాలి. పొల్లు పార్టీ సభ్యత్వాన్ని, రోజువారీ పార్టీ పనుల్లో పరీక్షించి, అనర్హులైన వారిని క్రమంగా తొలగించాలి.

2. ప్రతిసెల్లులో 3 నుండి 7 వరకు సభ్యులుండవచ్చును.

3. కాండిడేట్లను పార్టీ సభ్యులతో కలిపి సెల్లులు నిర్మించాలి.

4. 15 మంది కంటే మించి పార్టి సభ్యులున్న గ్రామంలో గ్రామకమిటీలు ఏర్పరచాలి.

5. ఆర్గనైజరు లేదా తాలూకా కమిటీసభ్యుడు గ్రామానికి వెళ్ళగానే సెల్లును సమావేశపరచడానికి సమయ మివ్వాలి. సెల్లుల ద్వారా పనులు నిర్వహించబడాలి.

## VI రిపోర్టింగు

పార్టి కేంద్రాన్ని బలపర్చటానికి నెరవేర్చవలసిన ఒక ముఖ్య కర్తవ్యం, అన్ని స్థాయిలలోను సరియైన రిపోర్టింగు ఏర్పాటు చేయుటే. అందుకుగాను ఈ దిగువ సూత్రాలను ఖచ్చితంగా అమలు చేయాలి.

1. క్రింది కమిటీలు, పై కమిటీలకు ప్రతిసమావేశానంతరం రిపోర్టు పంపాలి.

2. వివిధ పనులమీద పంపబడినవారు, వివిధ బాధ్యతలు నిర్వహించేవారు వ్రాత పూర్వకమైన రిపోర్టులు ఆయా కమిటీలకు సమర్పించాలి.

3. పై కమిటీలు సమావేశాల్లో తీసుకున్న ముఖ్య సమస్యలు, నిర్ణయాలను గురించి క్రింది కమిటీలకు తెలియ పరచాలి.

## (VII) ఆందోళనా-ప్రచారం

పార్టీ పత్రికలను అభివృద్ధి చేయటం, బాగుపరచటం ముఖ్యమైన తక్షణ కర్తవ్యంగా భావించాలి. పార్టీ నాయకులు ప్రజాఉద్యమాలనాయకులు పార్టీపత్రికలకు తరచుగా వ్రాస్తూండాలి. పార్టీ పత్రికల నభివృద్ధిచేయుటకుగాను కేంద్ర రాష్ట్ర

కమిటీలు నిరంతరం చర్చలు జరపాలి. పార్టీ పత్రిక అమ్మకం పెంచుటకు, పత్రికాభివృద్ధికి సూచనలివ్వడానికి సేకరించడానికి గాను పార్టీలో ఒక ఉద్యమం నడపాలి. ఇది చేయకపోతే పార్టీ పలుకుబడిని స్థిమితపర్చుకోవటం, నిర్మాణరీత్యా సంఘటిత పరచటం అసాధ్యం. మన ఆందోళన కార్యక్రమపు స్వభావాన్ని అభివృద్ధిపర్చుకోవడం, అసాధ్యం; పార్టీ సభ్యులను సానుభూతి పరులను ఉత్సాహపర్చటం అసాధ్యం. కొత్త ప్రాంతాలకు విస్తరించటం, ప్రజల రాజకీయ చైతన్యానికి పదునుపెట్టడం, పార్టీలోకి ప్రజలలోని ఉత్తములందరినీ తీసుకురావడం కూడా అసాధ్యమే.

పాక్ అమెరికా సైనికసంధి, భాషారాష్ట్రాలు, భూదానోద్యమం, మొదలైన సమస్యలపై ఎప్పటి కప్పుడు కరపత్రాలు వేయడంకూడా ఎంతో ముఖ్యం. పార్టీకి వ్యతిరేకంగా, కమ్యూనిజానికి వ్యతిరేకంగా శత్రువులు చేసే ప్రచారం, తరుచుగా ప్రజానీకాన్ని గందరగోళ పరుస్తుండే దుష్ప్రచారాన్ని బట్టబయలుచేస్తూ ఎప్పటి కప్పుడు వేసే కరపత్రాలు కూడా ఎంతో ఉపకరిస్తాయి. ఇట్టి కరపత్రాలు ప్రజల పరిజ్ఞానాన్ని పెంచుటేగాక, పార్టీ కార్యకర్తలందరిని కదిలించుతాయి. పార్టీ పంథాను నిశితంగా అవగాహన చేసుకోడానికి తోడ్పడతాయి. రాజకీయంగా ఐక్యమయ్యేట్లు చేస్తాయి. ఆ విధంగా పార్టీ నిర్మాణబలం పెంపొందుతుంది కూడా. ప్రజల నెదుర్కొనే సమస్యలపై యావత్తు పార్టీ సుశిక్షితమైన, నిర్మాణయుతమైన ఫక్కీలో కదిలి రంగంలో దిగటానికికూడా యిటువంటి కరపత్రాలు తోడ్పడుతాయి. అందుచే పార్టీ కేంద్ర, రాష్ట్ర

కమిటీలు అట్టి కరపత్రాలను సులభంగాను, సూటిగాను ఉండే భాషలో ఎప్పటికప్పుడు తయారుచేస్తుండాలి. వాటిని అచ్చువేసి అమ్మకం జరగడానికి కూడా ప్లాను వేయాలి.

దీనికై ఈ క్రిందిపనులు చేయాలి.

(1) స్థానిక పత్రికల్లో, పార్టీకి వ్యతిరేకంగా ఏరోజూ అనకుండా, జరుగుతున్న దుష్ప్రచారంలోని ముఖ్యాంశాలను, ఎప్పటి కప్పుడు ఖండించుతూ ఉండాలి. దీనికి సంబంధించిన అసత్యపు అభూతకల్పనలతో నిండిన వార్తలను ఖండించుతూ, యథార్థ విషయాలను బయటపెట్టాలి.

(2) విశాలాంధ్ర, నవయుగ, న్యూఏజి సందేశం పత్రికల్లో ఇలాంటి వార్తలతోబాటు, వ్యాసాలను విరివిగా ప్రకటించాలి. ఇవి పార్టీ వ్యతిరేక ప్రచారానికి సమాధానం మాత్రమేగాక, వర్తమాన సమస్యలపై పార్టీ దృక్పథాన్ని వివరించేవిగా కూడా ఉండాలి.

(3) తెలంగాణా కమిటీ దీనికై అవసరమైన ఏర్పాట్లు చేయాలి.

తెలంగాణా కమిటీ, జిల్లా తాలూకా యూనిట్లు వివిధ రంగాలకు బాధ్యతవహించి పనిచేసేవారు తమతమ బాధ్యతలకు సంబంధించినంత వరకు ఈ పని చేస్తూ ఉండాలి. ఉదా: ఒక రంగాన్ని చూచే కామ్రేడ్ లేక సబ్‌కమిటీ ఆ రంగానికి సంబంధించిన ఏర్పాట్లు చూచుకోవాలి. మేధావులైన సాధారణ పార్టీసభ్యులు, సానుభూతిపరులతో వ్రాయించి వారి సాయాన్ని కూడా పొందాలి.

(4) పత్రికల సర్క్యులేషన్‌ను పెంచాలి.

(5) పార్టీ సాహిత్యాన్ని అమ్మకం చేయాలి.

## VIII సవ్యమైన పార్టీ అంతరంగిక పోరాటాన్ని సాగించాలి.

పార్టీ కమిటీల్లో ప్రజల నెదుర్కొంటున్న అనేక తక్షణ సమస్యలపై ఐక్యత ఉన్నప్పటికీ, గతానికి సంబంధించిన ముఖ్య సమస్యలపై అభిప్రాయ భేదాలున్నవి. ముందుకూడ ఇలాంటివి పొడసూప వచ్చును. పార్టీ కమిటీలు వీటన్నిటినీ, కామ్రేడ్ లీ-షావు-చీ చెప్పిన సూత్రాల ప్రకారం సక్రమ పద్ధతిలో చర్చించి పోగొట్టుకొని, పార్టీని ఐక్యపరచాలి - పార్టీ కేడరుకు వీటినిగూర్చి శిక్షణ ఇవ్వాలి-పార్టీ యూనిట్లలో పొడసూపే అభిప్రాయ భేదాలు పెడమార్గాన పోకుండా వారించడానికి యూనిట్లు లీ-షావ్-చీ చెప్పిన ఈ క్రిందిసూచనలను పాటించాలి.

(1) "పై కమిటీలోనైనా మరే కమిటీలోనైనా భేదాభిప్రాయమున్న పార్టీ సభ్యులు, తమ విమర్శనలను, అభిప్రాయాలను ఉచితమైన పార్టీ యూనిటుకు అందించాలి. వాటినిగూర్చి ప్రజల్లో సొల్లువాగుడు గూడదు.

(2) ఇతర పార్టీసభ్యులతోనైనా, లేక బాధ్యతగల పార్టీసభ్యులతోనైనా, భేదాభిప్రాయ మేర్పడితే, పార్టీసభ్యులు, వారిని ముఖాముఖిగానైనా, లేక ఏదైనా పార్టీ కమిటీ ముందైనా విమర్శించాలిగాని, సొల్లువాగుడు కూడదు.

(3) పై కమిటీతో అభిప్రాయ భేదమున్న క్రింది కమిటీలు, దానికి సంబంధించిన సమస్యను ఆ కమిటీముందుకు తేవచ్చును. లేక దానిని స్టడీచేయడానికి కమిటీ సమావేశాన్ని పిలువమనవచ్చును. లేదా అంతకన్న పై కమిటీ ముందుకు

సమస్యను తీసుకవెళ్ళవచ్చును. కాని సొల్లువాగుడు కూడదు. క్రింది కమిటీలకు ఆ విషయమై తెలియజేయకూడదు.

(4) పార్టీసభ్యులు, ఇతరపార్టీసభ్యులుతప్పుచేస్తున్నట్లుగానైనా, పార్టి ప్రయోజనాలకు హానికరంగా ప్రవర్తించినట్లుగానైనా తమకు తెలిస్తే వెంటనే తగిన పార్టి కమిటీకి వాటిని గూర్చి రిపోర్టు చేయాలి. ఆ వ్యవహారాన్ని దాచిపెట్టడానికి గాని ఒకరినొకరు తప్పించడానికి గానీ ప్రయత్నించ గూడదు.

(5) పార్టీ సభ్యులు, మనసిచ్చి పనిచేసే పని ఫక్కీని అలవరచుకోవాలి. మోసకారితనాన్ని, మోసకారి మాటలను, పనులనూ వ్యతిరేకించాలి, ఇదేవిధంగా వాగుబోతుతనాన్ని, రంధ్రాన్వేషణాన్ని, వదంతులను వ్యాపింప జేయడాన్ని ఖండించాలి. మాట్లాడకూడని కొన్ని ప్రత్యేక విషయాలను గూర్చి మాట్లాడడాన్ని నిషేధించుతూ పై కమిటీలు సూచనలను పంపుతూ వుండాలి.

(6) వాగుబోతులను చాలుమూలలేని తగాదాలను సృష్టించే కామ్రేడ్స్‌ను, పైకమిటీలు ఎప్పటికప్పుడు సరిదిద్దడానికీ, హెచ్చరించడానికీ, అవసరమైతే ఇతరవిధాలా దారికితేవడానికీ ప్రయత్నించాలి. అన్ని స్థాయిల్లో గల పార్టికమిటీలు పార్టీ సభ్యులు వెల్లడించిన అభిప్రాయాలను గౌరవించాలి. పార్టీ కమిటీలు తరచుగా సమావేశాలను చేస్తూ పనిని సమీక్షించుతూ పార్టిసభ్యులకు తమతమ అభిప్రాయాలను వెల్లడించడానికి విశేషంగా అవకాశాలను కల్పించుతూ ఉండాలి."

ఈ సూచనలను సభ్యులు, యూనిట్లన్నీ పాటించడం అవసరం. అప్పుడే, పార్టీలోని భేదాభిప్రాయాలు పెడమార్గాన పోకుండా సక్రమంగా పరిష్కారమవుతాయి.

## (IX) విమర్శన - ఆత్మవిమర్శన

పార్టీని పట్టుకొని పీడిస్తున్న అవలక్షణాలను, బల హీనతలను సమూలంగా పెకలించడానికి విమర్శ - ఆత్మవిమర్శ లను అవశ్యం ప్రవేశ పెట్టాలి. ఇందులో క్రింది కమిటీలనుండి వచ్చే విమర్శ చాల ముఖ్యమైనది. పై కమిటీల యొక్క రాజ కీయ నిర్ణయాల గురించేకాక, వాటి నిర్మాణ పద్ధతులు; కేడర్ల పట్ల అవి అవలంబించే వైఖరి; తమ పనిగురించి ఇతరులు యిచ్చే విమర్శపట్ల అవలంబించే వైఖరి; పక్షపాత ధోరణులు; పార్టీకి హానికల్గించే వ్యక్తిగత చర్యలు, అలవాట్లు - వీటన్నిటి గురించి క్రింది కమిటీలు విమర్శలు పంపాలి. పార్టీ పత్రికలపై కూడా విమర్శలు పంపాలి. ఈ విమర్శ స్వేచ్ఛాయుతంగాను, నిర్భీతితోను ఉండుటేగాక, నిర్మాణాత్మకంగాను, సద్భావంతో కూడినదిగాను ఉండాలి. పై కమిటీలు క్రింది కమిటీలనుండి విమర్శలు ఆహ్వానించడమేగాక, విమర్శలు తప్పనిసరిగా పంపే ట్లు చేయాలి. ప్రోత్సాహం యివ్వాలి. ఆత్మవిమర్శ చేసు కోవటంలో పై కమిటీలు క్రింది కమిటీలకు ఆదర్శం చూపాలి. సరియైన ధోరణిలో విమర్శ స్వీకరించడం ఎట్లాగో చూపాలి.

పార్టీలో విమర్శ సవ్యంగా జరిగేట్లు ప్రోత్సహించా లంటే, క్రిందనున్న కమిటీలనుండి, కార్యేడ్సునుండి వచ్చే అన్ని ఉత్తరాలకు, రిపోర్టులకు పై కమిటీలు తప్పక సమాధానాలు యిస్తూండాలి. వారు లేవనెత్తిన సమస్యలను శ్రద్ధగా పరిశీ లించాలి. ఈ విషయంలో అశ్రద్ధ చేయటం, లేక సలహా పంపటంలో అదేపనిగా ఆలస్యం చేయటం పనికిరాదు. బ్యూరాక్ర టిక్ తత్వం లోగడవలెగాక నేడు క్రింది కమిటీల విమర్శలపట్ల

అశ్రద్ధ రూపంలో సాక్షాత్కరించుకొంది. ఈ అశ్రద్ధవలన విమర్శ పంపేవారు నిరుత్సాహానికి లోనవుతున్నారు.

### (X) ప్రజాసంఘాల నిర్మాణానికి పూనుకోవాలి.

నేడు పని చేస్తున్న కార్మికసంఘాలు, రైతు సంఘాలలో సభ్యత్వాన్ని హెచ్చుగా చేర్పించి, ఆఫీసుల నేర్పరచి కమిటీలను పని చేయించాలి. ఫ్యాక్టరీ, గ్రామ కమిటీలు ఏర్పరచి వాటిని పనిచేయించాలి.

వ్యవసాయకూలి, మహిళా, విద్యార్థి, యువజన, చేనేత, గీత పారిశ్రామిక సంఘాలను, కళాసంస్థలను, వైజ్ఞానిక దళాలను, శాంతి కమిటీలను అవకాశమున్న చోట నిర్మించాలి. ప్రజా సంఘాలను ప్రజాస్వామిక పద్ధతులపై అభివృద్ధిచేయాలి. ప్రజా సంఘాల కమిటీల్లోకి, ఆయా ప్రజాసంఘాల అభివృద్ధికి తోడ్పడగలిగే పార్టీయేతరులను అనుభవజ్ఞులైన వారినీ సమీకరించి వాటిని విశాల ప్రాతిపదికపై నిర్మించాలి.

పార్టీలో పార్టీకి, ప్రజాసంఘాలకు ఉండవలసిన సంబంధాలనుగూర్చి స్పష్టమైన దృక్పథం లేదు. ప్రజాసంఘాలు స్వతంత్రంగాను ప్రజాస్వామికంగాను పనిచేసేవిధంగా అభివృద్ధి గావాలంటే, వీటియెడ స్పష్టమైన దృక్పథం ఉండాలి.

ప్రజాసంఘాల్లో చేరే ప్రజల్లో పార్టీ పలుకుబడికింద ఉండేవారే గాక, ఏ పార్టీకి చెందనివారు, ఇతరపార్టీల పలుకుబడి కింద వుండేవారుకూడా ఉన్నారు. అదే విధంగా ఈ సంఘాల కమిటీల్లో పార్టీసభ్యులేగాక పార్టీయేతరులుగూడా వున్నారు. ఈ సంఘాలన్నీ ప్రత్యేక నియమావళుల ననుసరించి పని చేస్తాయి. వీటి వెనుక పార్టీ పలుకుబడి కింద ఉండే ప్రజలు,

కమిటీల్లో పార్టీసభ్యులు, సానుభూతిపరులు హెచ్చు సంఖ్యలో ఉన్నంతమాత్రాన, ప్రజాసంఘాల పార్టీయేతర స్వభావంలో ఎలాంటి మార్పూ జరుగదు. కనుక ప్రజాసంఘాలు ప్రజా సంఘాలుగనే స్వతంత్రంగాను ప్రజాస్వామికంగానుపనిచేయాలి. ఈ మార్గాననే అభివృద్ధికావాలి.

దీనికై, ప్రజాసంఘాల్లో, పార్టీ పలుకుబడిక్రింద ఉన్న ప్రజలనేగాక, పార్టీయేతరులను హెచ్చుసంఖ్యలో సభ్యులుగా చేర్పించాలి. ప్రజాసంఘాల కార్యకర్తలు వారి దగ్గరకువెళ్ళి, సంఘంయొక్క పార్టీయేతర స్వభావాన్నిగూర్చి దానిలో చేరే వారందరికీగల సమాన హక్కులనుగూర్చి వివరించి నచ్చ చెప్పాలి. ఇదేవిధంగా, ఆయా ప్రజాసంఘాల కమిటీల్లోఉన్న పార్టీయేతరులను, కమిటీ కార్యకలాపాల్లోను, చర్చల్లోనూ సంపూర్ణంగా పాల్గొనడానికి ప్రోత్సహించుతూ, పార్టీ కార్య కర్తలు తాము ప్రజాసంఘాలను నిర్మించడానికై చేసేకృషి, ప్రజా సమస్యలయెడ శ్రద్ధ, పార్టీయేతరులతో జరిగే చర్చల్లో వారికి నచ్చచెప్పడంమీద ఆధారపడి, ఐక్య ప్రజాసంఘాల నిర్మాణంసాగాలి. కాని పార్టీసభ్యుల మెజారిటీబలంపై ఆధార పడగూడదు. అప్పుడే ప్రజాసంఘాలు విశాల ప్రాతిపదికపై నిర్మింపబడుతాయి.

## (XI) కార్యకర్తల శిక్షణ

రాజకీయ నిర్మాణ తీర్మానాల్లో జెప్పిన రాజకీయ నిర్మాణ కర్తవ్యాలు సక్రమంగా నిర్వర్తించి మన పార్టీలో నూతన మార్పు (New turn) రావాలంటే కార్యకర్తలకు రాజకీయ శిక్షణ యివ్వటం అత్యావసరం. ఇది జరుగనిదే

మార్పులు తేవటం సాధ్యంకాదు. అందువలన తెలంగాణా కమ్యూనిస్టు కమిటీ సాధ్యమైనంత త్వరలో జిల్లా కమిటీ సభ్యులవరకు శిక్షణ యిచ్చుటకు రాజకీయ తరగతులు నడపాలి. ముఖ్యమైన జిల్లా కమిటీలు, స్థానిక ఆర్గనైజర్లు, సెల్లు కార్యదర్శుల కొరకు తరగతులు నడుపుటకొరకు తె. క. పాఠ్యక్రమాన్ని తయ్యారు చేసి పంపాలి. అవసరమైన శిక్షకులను కూడా పంపాలి.

చదువురాని పార్టీ సభ్యులకు మామూలు దినపత్రికలు చదువుకునే స్థాయివరకు చదువు వచ్చునట్లు చూచుట తమ బాధ్యతగా స్థానిక కమిటీలు, సెల్లులు గుర్తించాలి.

అవకాశాలున్న ప్రతి చోట రాత్రిపాఠశాలలు, వయోజన విద్యాలయాల ద్వారా యీ పనికి పూనుకోవాలి.

చదువు వచ్చిన ప్రతిపార్టీసభ్యుడు తప్పక విశాలాంధ్ర, నవయుగం, యితర పార్టీ కరపత్రాలు చదువునట్లు చూడాలి.

ప్రతి ఆర్గనైజరు ఈ క్రింది పుస్తకాలు అధ్యయనం చేయాలి: (1) భారత కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమము (2) నిబంధనావళి (3) పార్టీనిర్మాణం-లీషావ్‌చీ. (4) మంచి కమ్యూనిస్టు ఎలా వుండాలి (5) పార్టీ ఆంతరంగిక పోరాటం (6) పరిణామ వాదం (7) గతి తార్కిక భౌతికవాదం (8) చారిత్రక భౌతిక వాదం 9. మార్క్సిజం అంటే ఏమిటి? 10. పార్టీ నిర్మాణ సూత్రాలు-స్టాలిన్ 11. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర 12. భారత కమ్యూనిస్టు పార్టీ నిర్మాణ తీర్మానం.

పార్టీ సభ్యులవరకు వెంటనే రెండు రోజులు క్లాసులు పెట్టి; 1. భారత కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమం 2. పార్టీ నిబంధనావళి 3. తెలంగాణా పార్టీ మహాసభ నిర్ణయాలు చెప్పాలి.

ముఖ్యంగా పార్టి సభ్యులకు వారి హక్కులను, బాధ్యత లనుగూర్చి బాగా వివరించి చెప్పాలి. పార్టి నిబంధనావళిలోని ఈ అంశాన్ని సాధారణ పార్టి సభ్యులకేగాక, కార్యకర్తలకు గూడా అర్థంచేయించాలి. అప్పుడే వారు పార్టి నిర్మాణాన్ని బలపరచడంలో తమవంతు బాధ్యతలను నిర్వహించ గలుగు తారు.

## (XII) హోల్ టైమర్లు

హోల్ టైమర్ల సమస్య :- గతంలో తెలంగాణా కమిటీ ఎవరెవరిని హోల్ టైమర్లుగా పరిగణించాలో మరియు వారి అర్హతల గురించి ఒక సర్క్యులర్ పంపినప్పటికి హోల్ టైమర్ల గురించి సరియైన అవగాహన యింతవరకు పార్టీలో లేదనే చెప్పాలి. హోల్ టైమర్లు పార్టీలో అతిముఖ్యపాత్రను నిర్వ హించినప్పటికి, రోజువారి కార్యకలాపాల నిర్వహణ స్థానిక పార్టీ సభ్యులే కొనసాగించవలసి ఉంటుంది. స్థానిక పార్టీసభ్యుల ద్వారా పనతీసికొనే పద్ధతిపోయి ప్రతిపనికి హోల్ టైమర్లపై ఆధారపడటం జరుగుచున్నది. పని కాకపోతే కొత్తగా కొంత మందిని సరైన అర్హతలున్నా, లేకపోయినా హోల్ టైమర్లుగా నియోగించడం, వారు సక్రమంగా పనిచేయలేకపోవడం, వారికి సక్రమవేతనా లివ్వలేక వారు నిస్పృహలో పడటం, కొన్ని సందర్భాలలో వారు పార్టీకే సమస్యగా తయ్యారవటం జరుగు తున్నది.

రెండవప్రక్క పార్టి కమిటీలు తమ ఆదాయ వ్యయా లను క్రమబద్ధ మొనరించక పోవటంవలన, అప్పులైనప్పటికీ, పోషించలేమనే కారణంతో వ్యవసాయకూలీ, పేదరైతులనుండి

వచ్చిన వారిని హోల్‌టైమర్లుగా తీసుకోనక పోవటం, కేవలం పోషించ నవసరంలేదనే కారణంతో అర్హతలేకున్న, పై వర్గాల నుండి వచ్చిన వారిని హోల్‌టైమర్లుగా నియమించటం జరుగు చున్నది. ఈ పద్ధతి పార్టి అభివృద్ధికి ఎంతైనా హానికరం.

ఈ రకంగా హోల్ టైమర్లను తీసికొనేపద్ధతికి వెంటనే స్వస్తి చెప్పాలి. ప్రస్తుతం జిల్లాల్లోవున్న హోల్ టైమర్లు ఎంత మంది, వారు ఆయాపనులు చేయుటకు ఎంతవరకు సమర్థులు, వారిని పోషించుటకువున్న అవకాశాలు మొదలగు ముఖ్యమైన విషయాలన్నీ గణనకు తీసికొని హోల్‌టైమర్ల సమస్యను జిల్లా కమిటీలు వెంటనే పునఃపరిశీలన జరిపి ప్రస్తుత పార్టీనిర్మాణ అవస రాలకుమించి అదనంగావున్నవారిని వృత్తులు చూచుకొనమని చెప్పాలి. అయితే పార్టీ నిర్వహణకు అత్యవసరమైన హోల్ టైమర్లను తీసికొనేటప్పుడు తాలూకా పార్టీ కమిటీల సిఫా రసుపై జిల్లా కమిటీలు మాత్రమే యీ హోల్‌టైమర్లను నియమించాలి. ఎవరుపడితే వారు హోల్‌టైమర్లను నియ మించరాదు.

## (XIII) బడ్జెటులు

పార్టీ కమిటీలు బడ్జెటులను వేసుకొని వాటి ప్రకా రంగా ఆదాయ వ్యయాలను క్రమబద్ధ మొనరించాలి. అర్హు లైన హోల్‌టైమర్లను కమిటీలు పోషించునట్లుగా కమిటీల ఆర్థిక స్థితిని చక్కబరచాలి. ఇంకా ఈ క్రింది పనులుచేయాలి:

1. ప్రజలనుండి డబ్బు వసూలుచేసే పద్ధతిని ఖచ్చితంగా అమలులోపెట్టాలి. ఆయా యూనిట్లుపై కమిటీలపై ఆధారపడ కుండా పోరాటాలు కాంపేన్ల సందర్భములో పార్టి సానుభూతి

పరులు, సభ్యులనుంచి వసూలుచేయాలి. ముఖ్యంగా పంటలు చేతికి వచ్చేకాలంలో పెద్దఎత్తున ప్రజాబాహుళ్యంనుండి పై చందాలు వసూలుచేయడానికి ఉద్యమాన్ని నడిపించాలి.

2. ఆయా యూనిట్లతోపాటు, పై కమిటీలవారు గూడ సంవత్సరంలో ఒకటి రెండుసార్లు పంట వచ్చేకాలంలో ప్లాను ప్రకారం ఫండు వసూలుచేసే కార్యక్రమం తీసుకోవాలి.

3. పార్టీ సభ్యులవద్దనుండి రెగ్యులర్‌గా చందాలు, లెవీలు వసూలు చెయ్యాలి.

## (XIV) కార్యకర్తల పని ఫక్కీ మారాలి.

కార్యకర్తలు గ్రామాలకుపోయినప్పుడు సరాసరి తాము గ్రామ సమస్యలు తీసికొనే పద్ధతి పూర్తిగా మారాలి. గ్రామ సమస్యలు కార్యకర్తల ముందుకువస్తే వాటినిముందు ఆ గ్రామ సెల్లులో చర్చించి సెల్లుద్వారా వాటిని పరిష్కరింప చెయ్యటానికి పూనుకోవాలి. అప్పుడే స్థానిక నాయకత్వం అభివృద్ధి కావడం వారికి ఆత్మవిశ్వాసం పెరుగుతుంది.

అలాగే కార్యకర్తలు గ్రామ పంచాయితీలను తీసుకొనే పద్ధతికి పూర్తిగా స్వస్తిచెప్పాలి. ఉ॥ గ్రామాలలో భూస్వాములకు, రైతులకు మధ్య తగాదాలువస్తే అది రైతాంగ సమస్యగా తీసికొని ప్రజలను సమీకరించి రైతులకు న్యాయం జరిగేటట్లుచూడాలి. కాని దానిని పంచాయితీగాచిత్రించ రాదు. ఆయా వర్గప్రజలమధ్య వచ్చిన పంచాయితీలను(గట్టుపంచాయితీ రైతుల, రైతులమధ్య వచ్చిన తగాదాలు, భార్యాభర్తల మధ్య వచ్చిన తగాదాలు) మధ్యవర్తుల ద్వారానో లేక యితర

మార్గాల ద్వారానో పరిష్కరించుకొనేటట్లు చూడాలి. గాని పార్టీ అందులో జోక్యం పుచ్చుకొనరాదు.

ఏదైనా ఒక సమస్య గ్రామ ఐక్యతకు భంగం కల్గిచేంది గాని, లేక మొత్తం గ్రామస్తులందరికీ సంబంధించినది అయిన ప్పుడు మాత్రం పార్టీ దానిని పరిష్కరించుటకు పూనుకొని గ్రామ ఐక్యత కాపాడాలి.

(3) సమస్యలు తీసికొనేటప్పుడు, ఎప్పుడు ఏ సమస్యకు అత్యధిక రాజకీయ ప్రాముఖ్యతయివ్వాలో ఆసమస్యకే ప్రాధా న్యత నివ్వాలితప్ప, అన్ని సమస్యలు ఒకేగాటను కట్టరాదు. మన పునాది వర్గాలైన వ్యవసాయకూలీ, పేద్ద రైతుల సమస్యలకు ప్రాధాన్యతయివ్వాలి. తర్వాత మొత్తం రైతాంగానికి, మొత్తం గ్రామానికి సంబంధించిన సమస్యలు తీసికోవాలి.

(XV) సభ్యులు, పార్టీ నాయకులు తమ వ్యక్తిగత జీవితంలో అభివృద్ధినిరోధక ఫ్యూడల్ సాంప్రదాయాలకు తలవొగ్గకుండా, వాటికి వ్యతిరేకంగా పోరాటం సాగించాలి. తమ తమ విప్లవ జీవితపు ప్రత్యేకతను కాపాడుకోడానికి ఎడతెగనికృషి చేయాలి.

## ముగింపు

పార్టీ ముందున్న ఈ కర్తవ్యాలను సక్రమంగా నెర వేర్చాలంటే పార్టీనినిర్మించి బలపరచవలసిన ఆవశ్యకతనుగుర్తిం చాలి; పార్టీ నిర్మాణ మొక స్వతంత్ర కర్తవ్యంగా పార్టీ యూని ట్లన్నీ గుర్తించాలి; ఈ కర్తవ్యాన్ని నెరవేర్చుటకు తమ శక్తి నంతటినీ కేంద్రీకరించి పనిచేయాలి.

ఈ కర్తవ్యాలన్నిటిలో ముఖ్యమైనవి పార్టీలో ఫారా లను పునరుద్ధరించడం, సమిష్టి కార్యాచరణ విధానాన్ని అనుస రించి పనిచేయడం, వీటిద్వారా పార్టీ నిర్మాణాన్ని బలపరచడం ప్రారంభించాలి. దీనివలన తక్కిన కర్తవ్యాలను సులభంగా నెరవేర్చవచ్చును.

కామ్రేడ్స్ అంతా పార్టీని ఐక్యపరచి, బలపరచవలసిన అవసరాన్ని గుర్తించియున్న నేటి స్థితిలో, పార్టీ యూనిట్లు ఈ బాధ్యతలను నిర్వహించడానికి ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగాలి. స్వల్పకాలంలోనే పార్టీని ప్రజా రాజకీయ పార్టీగా వృద్ధిచేసి పార్టీలో సమిష్టి నాయకత్వాన్ని వృద్ధిపరచి, పార్టీ నిర్మాణాన్ని బలపరచాలి. దీనిద్వారా ఐక్యప్రజాతంత్ర ప్రభు త్వాన్ని సాధించాలి.

భారత కమ్యూనిస్టుపార్టీ యొక్క విప్లవ సాంప్రదాయా లను ముందుకు తీసికొనిపోయిన తెలంగాణా అమరజీవులు మనపై వేసిన పవిత్రమైనబాధ్యతను గుర్తించి, ఈ కర్తవ్యాలను నిర్వ ర్తించడానికి పార్టీ యూనిట్లన్నీ నడుం బిగించాలి.



# పి. డి. యఫ్. మీద తీర్మానం

1. హైదరాబాదులో జనరల్ ఎన్నికలకు ముందు ప్రజాస్వామిక పార్టీల, గ్రూపుల, వ్యక్తులయొక్క ఐక్య సంఘటనగా నిర్దిష్టమైన కార్యక్రమం మీద ప్రజలను సమీకరించి కాంగ్రెసు ప్రభుత్వాన్ని ఓడించి ప్రజలకు మేలుచేకూర్చే ప్రభుత్వాన్ని ఏర్పరచుటకు పి. డి. యఫ్. ఏర్పడింది.

2. సంస్థాన మంతటా, ముఖ్యంగా తెలంగాణాలోని ప్రజలు రక్తాన్ని, అశ్రువులను నిత్యం పెరిగిపోతున్న దారిద్ర్యాన్ని, దారుణమైన దమననీతిని ప్రసాదిస్తున్న మిలటరీ పాలనను తీవ్రంగా ద్వేషిస్తున్న ప్రత్యేక పరిస్థితుల్లో పి. డి. యఫ్. ఉద్భవించింది. తెలంగాణాలో నిజాంకు, అతని తొత్తులైన జమీందార్లకు వాళ్ళ సాయుధ దండులకు వ్యతిరేకంగా భూమి, భుక్తి, స్వాతంత్ర్యం కోసం రాజీలేని పోరాటం సాగించినందుకు రైతాంగంమీద మారణయుద్ధం కొనసాగించబడింది. ఆనాడు కాంగ్రెసు పాలనంటే తీవ్రమైన అసహ్యత, దానితో పోరాడి దానిని మార్చాలనే విశాలమైన ఆకాంక్ష ప్రజలలో వుంది.

3. కాంగ్రెసు ప్రభుత్వంతో పోరాడి, దానిని మార్చవలెనని తీవ్రంగా ఆలోచించేవారికి స్పష్టమైన కార్యక్రమం, దృక్పథం లోపించడం వలన వారి కాంక్ష నిర్దుష్టమైన స్వరూపం తీసుకోలేకపోయింది. కాంగ్రెసునుండి బయటపడ్డవారు 'లీగ్ ఆఫ్ సోషలిస్టు వర్కర్సు'ను స్థాపించి తమ కార్యకలాపాలను

ప్రధానంగా మరాత్వాడాలో సాగించారు. హైదరాబాదు పట్టణమునకు పరిమితమైవున్న 'పీపుల్సు డెమోక్రాటిక్ పార్టీ' నూతనంగా ఏర్పరచబడింది. మరత్వాడాలోని ' పెజెంట్సు అండ్ వర్కర్సుపార్టీ 'లోనుండి కొందరు విడిపోయి 'కిసాన్ కామ్‌గార్ పక్షాన్ని' స్థాపించారు. ఈ పక్షం ముఖ్యంగా భీడ్ లాంటి జిల్లాలో బలంగా వుంది. వీరుగాక అనేక ప్రముఖవ్యక్తులు కాంగ్రెసుకు వ్యతిరేకంగా ముందుకు వచ్చారు. కాని, కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఐక్య ప్రజాతంత్ర ప్రతిఘటన ఎలా సాగించాలో సరైన దృక్పథం లేకపోవుటవలన వీరందరూ ప్రతిష్టంభనను ఎదుర్కొనవలసి వచ్చింది.

4. ఈ పరిస్థితుల్లో మన నూతన కార్యక్రమం వచ్చింది. స్పష్టంగా నిర్వచించబడిన మూల శత్రువైన ఫ్యూడలిజం, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా ప్రజాస్వామిక శక్తులను సమీకరించుతూ, మన పోరాటంయొక్క దిక్కును నిర్ణయిస్తూ సమిష్టి కార్యాచరణకోసం, ఐక్య సంఘటనకోసం, మన కార్యక్రమం పిలుపునిచ్చింది. కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగే ఎన్నికల పోరాటంలో ప్రజాస్వామిక శక్తులన్నీ కలసి పాల్గొనవలసిందిగా మన ఎన్నికల ప్రణాళిక పిలుపు యిచ్చింది. సంస్థానంలో పైన చెప్పిన కాంగ్రెసు వ్యతిరేక ప్రజాస్వామిక శక్తులు ఎదుర్కొన్న ప్రతిష్టంభనను యీ పిలుపు బ్రద్దలుచేసి వారికి ఉత్తేజకరమైన మార్గాన్ని చూపింది.

5. ఈ రకంగా కమ్యూనిస్టులు, డి. పి. పి; ఎల్. ఎస్. డబ్లూ; కె. కె. పి., కొంతమంది ప్రముఖవ్యక్తులు పి. డి. ఎఫ్. కేంద్ర కౌన్సిలును ఏర్పరచారు. ఇది ఆయావ్యక్తుల, పార్టీల

యొక్క కేంద్ర నాయకులయొక్క ఐక్యసంఘటన కమిటీగా ఏర్పడింది. సోవియట్ యూనియన్, ప్రజా చైనా, వారి నాయకత్వం క్రిందవున్న శాంతి శిబిరంతో మిత్రృత్వమూ, ఐక్య ప్రజా సంఘాలను బలపరుస్తూ ప్రజాసేవ, కమ్యూనిస్టుపార్టీతో ఐక్యత అనే యీ మూడుసూత్రాలు ఐక్య సంఘటనకు, దాని కార్యక్రమానికి పునాది రాళ్ళు.

6. పి. డి. ఎఫ్. లో సుప్రసిద్ధ తెలంగాణా పోరాటాన్ని నడిపిన కమ్యూనిస్టుపార్టీ వుండటం ప్రజలు గమనించారు. గొప్ప విప్లవ సాంప్రదాయాలు గలిగిన పెద్ద పార్టీయిందులో వుండటం ప్రజల్లో పి. డి. యఫ్. పై విశ్వాసాన్ని పురికొల్పింది. అశేష ప్రజానీకాన్ని సమీకరించగలిగిన కమ్యూనిస్టుపార్టీతో గూడిన ఐక్యసంఘటనయే పి. డి. యఫ్. వెనకాల ప్రజానీకాన్ని సమీకరించి, పైశాచిక నిర్బంధ విధానాన్ని బ్రద్దలుచేసి, తెలంగాణాలో కాంగ్రెసును చిత్తుగా ఓడించింది.

7. పి. డి. ఎఫ్. యెన్నికలముందు ఏర్పడినప్పటికీ యిది కేవలం ఎన్నికల కలయిక మాత్రమే కాదు. ప్రధానంగా పై పార్టీల, గ్రూపులతో ఏర్పరచబడినప్పటికి ఇది కేవలం పై పార్టీల, గ్రూపులవరకే పరిమితం చెయ్యబడలేదు. ఇతర ప్రజాస్వామిక శక్తులు, గ్రూపులు తమ అనుభవంద్వారా యిందులో చేరటానికి అవకాశాలు కల్పించబడినవి.

8. కాంగ్రెసు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ముందుకు వస్తున్న ప్రజాస్వామికశక్తులను ఏ రకంగా ఐక్యపరచాలి అనే హంశంమీద ప్రధానంగా పి. డి. యఫ్. నిర్మాణం, అది ఎలా పనిచేయాలి అనే సమస్యమీద, మనకు పి. డి. యఫ్. లోని

యితర మిత్రులకు ఎన్నికలనంతరం తీవ్ర అభిప్రాయ భేదాలు వచ్చినాయి.

9. వీటిమీద క్లుప్తంగా గోవిందదాస్ షరాఫ్ వాదన ఇది:

—ప్రజల విశ్వాసం అందులోవున్న వివిధ పార్టీలమీద కన్నా పి. డి. ఎఫ్. మీదే వుండేటట్లుగా, అది కాంగ్రెసు వ్యతిరేక ప్రధాన రాజకీయసంసగా ప్రజల ముందుకు రావాలి.

—సమిష్టి కార్యక్రమంమీద ఆందోళన, ప్రచారం పి. డి. యఫ్. ద్వారా మాత్రమే జరగాలి.

—పి. డి. యఫ్. కు ప్రజాసంఘాలు ప్రధాన ప్రాతిపదికగా వుండాలి. అందులోని పార్టీలకు రెండవస్థానమే వుంటుంది. అప్పుడు మాత్రమే దానికి సరైన ప్రజా ప్రాతిపదిక వుండి ప్రజానుమతిని పొందుతుంది.

—నిర్ణయాలు మెజారిటీతో తీసుకోబడాలిగాని, ఏకగ్రీవాంగీకార సూత్రముండకూడదు.

10. పి. డి. యఫ్ ను దాదాపు ఒక ఏకీకృత రాజకీయ సంస్థగా తయారుచేసే యీ దృక్పథంతో కమ్యూనిస్టుపార్టీ సూత్రప్రాయంగా అంగీకరించలేదు. వివిధ పార్టీల, గ్రూపుల, వ్యక్తుల కలయికయే పి. డి. యఫ్. అన్న భావనకే యిది విరుద్ధం. పి. డి. యఫ్. వివిధ రాజకీయాభిప్రాయాలు కలిగిన వ్యక్తులు, గ్రూపులు, పార్టీలు తాము అంగీకరించిన కార్యక్రమాన్ని అమలు జరుపటానికి వచ్చిన సంస్థ తప్ప, తాము ఒకరితో ఒకరు లీనమవటానికి కాదు. అందుచేతనే అనుబంధ పార్టీలకు, గ్రూపులకు, వ్యక్తులకు ప్రత్యేక కార్యక్రమాలు

నిరాకరించబడవు. అనుబంధ సంస్థల వ్యక్తిత్వాన్ని అణచే ప్రయత్నంచేస్తే, యితరులు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోతామనే భయంతో పి. డి. యఫ్.లో చేరటానికి జంకుతారు. ఇది పి. డి. యఫ్. అభివృద్ధికే ఆటంకము. అందుచేత పి. డి. యఫ్. అన్ని పార్టీలను లీనంచేసుకునే ఏకీకృతసంస్థగాగానీ, లేక అనుబంధ సంస్థలన్నింటికి అతీతమైన సమిష్టికార్యక్రమము, కార్యాచరణకు సంబంధించి కాక ఖచ్చితమైన క్రమశిక్షణ అమలు జరిపే ఉన్నతపార్టీగాగానీ, వుండజాలదు.

11. ప్రజాసంఘాలను పి. డి. యఫ్. కు సమిష్టిగా అనుబంధించటానికి కమ్యూనిస్టుపార్టీ సూత్రప్రాయంగా వ్యతిరేకంకాదు. కాని ప్రజా సంఘాలు చీలికలై, వివిధ రాజకీయ పక్షాల మధ్య చీల్చబడివున్న ఈదశలో, నేడు వాటిని సమిష్టిగా అనుబంధించటం, వారి జీవన ప్రమాణం పెంపుదలకు, రోజువారీ కోర్కెలకోసం సాగించే పోరాటాలలో నిర్మించాల్సిన ఐక్యతకు హాని కలిగిస్తుంది. వాస్తవంగా ప్రజాసంఘాలు రాజకీయాలు లేని సంస్థలు కాదు. కాని నిస్సందేహంగా అవి పార్టీయేతర సంస్థలు, వాటి నిర్ణయాలు ప్రజల్లోని పోరాటఐక్యతను, వారిలోని రాజకీయ, సిద్ధాంత అభిప్రాయ భేదాలను వాస్తవంగా ప్రతిబింబించుతూ వుంటాయి. ప్రజాసంఘాలను రాజకీయ పంథాలమీద విడదీసే ప్రయత్నం, ఉమ్మడి శత్రువుమీద రోజువారీ కోర్కెలకోసం, హక్కులకోసం అవి సాగించే పోరాటంలో వాటిని నిరాయుధం చేస్తుంది.

12. వాస్తవ పరిస్థితి యిది కాబట్టి, యీ తరుణంలో పి. డి. యఫ్. ప్రజలను సమిష్టి కార్యాచరణకు పురికొల్పే వివిధ

పార్టీల, గ్రూపుల, వ్యక్తులయొక్క ఐక్యసంఘటనగా మాత్రమే వుండగలుగుతుంది గాని, ఏకీకృత రాజకీయ సంస్థగాకాదు. ఇలాంటి ఐక్యసంఘటన ప్రధాన సమస్యలమీద ఏకగ్రీవాంగీకార సూత్రంమీద, లేక అత్యధిక అంగీకార సూత్రంమీదమాత్రమే పనిచేయ కలుగుతుంది. ఆ ఐక్య సంఘటనకు కార్యక్రమము, నిర్మాణ స్వరూపం ఎలావుండాలి?

13. ప్రస్తుతం ప్రజలకున్న చైతన్యస్థాయిని ఐక్యతను, నిర్మాణ బలాన్ని, పోరాటశక్తినిమించి పి. డి. యఫ్. కార్య క్రమ మున్నదని మన అనుభవం చాటుతున్నది. నేడు రైతాంగం ప్రస్తుతమున్న కౌలుభూములనుండి బేదఖలు కాకుండానూ, కౌలు తగ్గింపుకు, ఋణ విమోచనంకొరకు, పోరాడుచున్నారు. కార్మికులు, వారు ఏ అనుబంధ సంఘాలలో వున్నప్పటికీ, పని నుండి తొలగింపుకు, రేషనలైజేషనుకు, పనిభారం పెంపుదలకు, మిల్లులు మూసివేయటానికి వ్యతిరేకంగానూ, జీతాల పెరుగు దల, ఉద్యోగరక్షణ, సాంఘిక భీమాలకోసం, ట్రేడ్ యూని యను హక్కులకోసం పోరాటాలు సాగించుచున్నారు. చిన్న పరిశ్రమాధిపతులు తాము నిలద్రొక్కుకొనుటకు ప్రభుత్వ సహాయంకోసం కృషి చేస్తున్నారు. వర్తకులంతా అన్యాయ మైన ఈ పన్నులవిధానమంటే మండిపడుతున్నారు. విద్యార్థులు ఎక్కువ విద్యావకాశాలు, ఉద్యోగాలకోసం పోరాడుచున్నారు. పరిపాలనలోని అవినీతి, బంధుప్రీతి అంటే మొత్తం ప్రజలందరి లోనూ తీవ్రమైన అసహ్యత ప్రబలింది. ఈ అన్ని పోరాటాలు కూడా ప్రజలందరిని ఒక తక్షణ కార్యక్రమంమీద సమీకరించి,

అసెంబ్లీలోపల, బయటా పోరాటం సాగించేందుకు విశాలమైన ఐక్యసంఘటనను నిర్మించే సమస్యను ముందుకు తెస్తున్నవి.

14. వివిధపట్టణాలలోని మునిసిపలు కమిటీలలో ఐక్య సంఘటనా కమిటీలు అభివృద్ధిచెందటం మనం చూచాము. కొన్నిప్రాంతాల్లో యీ కమిటీలు పి. డి. యఫ్. కంటే విశాల ప్రాతిపదికమీద వున్నాయి. కొన్నిచోట్ల పి. డి. యఫ్. యే ఎన్నికలలో పోటీచేసింది. అయితే యీఅన్ని సందర్భాలలోనూ, యీ కమిటీలు స్థానిక సంస్థల అధికారాలను విస్తృతపరచ టానికి, ప్రజలకు మునిసిపాలిటీలద్వారా సేవచేయటానికి ఉద్దే శించబడినాయి.

15. అన్నిటికన్నా ముఖ్యమైన అనుభవం ఏమిటంటే ఒక ప్రత్యేక సమస్యకోసం ఉ॥ ఆహార సబ్సిడీ విరమణ, ఉస్మా నియా విశ్వవిద్యాలయ సమస్య, భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం, ప్రాజెక్టుల నిర్మాణం మొదలైన వాటిమీద ఏర్పడిన ఐక్యసంఘటన కమిటీలు విశాల ప్రజానీకాన్ని సమీకరించ గలిగినవి. ఈ పోరాటాలన్నీ ప్రభుత్వంయొక్క పాలసీలకు వ్యతి రేకంగా ప్రజలయొక్క ప్రత్యేక కోర్కెలకోసం కొనసాగించ బడినాయి. ప్రజలను సమీకరించటంలోనూ, వారి చైతన్యాన్ని, పోరాటశక్తిని యినుమడింప చేయటంలోనూ ప్రభుత్వాన్ని బట్టబయలుచేసి దాన్ని మార్చవలసిన అవసరాన్ని గుర్తింప చేయటంలోనూ, ప్రధానంగా ప్రజలకు కొన్ని హక్కులు సాధించి ఐక్య కార్యాచరణమీద వారి విశ్వాసాన్ని పెంపొం దించటంలోనూ యీ కమిటీలు అతిముఖ్యపాత్ర నిర్వ హించాయి.

16. ఈ పోరాటాలయొక్క, ఐక్యసంఘటనా కమిటీల యొక్క ప్రయోజనాలు, పరిమితులు వేరైనప్పటికీ ప్రజల యొక్క ఐక్య కార్యాచరణను తద్వారా వారియొక్క చైతన్య స్థాయిని పెంపొందించే క్రమాన్ని యివి సూచిస్తున్నాయి. ప్రజా ఉద్యమం అభివృద్ధి చెందాలంటే ఈ క్రమాన్ని గుర్తించి ప్రత్యేక సమస్యలమీద ప్రత్యేక ఐక్య కార్యాచరణ కమిటీలను రూపొందించటం అత్యవసరం.

17. గత రెండున్నర సంవత్సరాల్లోనూ వివిధరకాలైన ఐక్యసంఘటనా కమిటీలు ఏర్పడడం, అన్నిటికంటే ప్రధానంగా వివిధ పార్టీల, గ్రూపుల, వ్యక్తుల ప్రాతినిధ్యంతో కూడిన పి. డి. యఫ్. కేంద్ర కౌన్సిలు ఏర్పడడం చూచాం. ఎన్నికలముందు, ఎన్నికలకోసం, అనేకచోట్ల స్థానిక పి. డి. యఫ్ కమిటీలు ఏర్పడినాయి. అనేక ప్రదేశాల్లో పార్టీ ముఖ్యులే పి. డి. యఫ్. పేరుతో పనిచేశారు. కొన్నిచోట్ల కమ్యూనిస్టులు, యితర ముఖ్యులు పి. డి. యఫ్. కమిటీల్లో పనిచేశారు. మున్సిపలు కమిటీల్లోనూ, పట్టణ కమిటీల్లో పి. డి. యఫ్. ఒక గ్రూపుగా ప్రత్యేకముగా ఒక నాయకుణ్ణి ఎన్నుకొని పనిచేస్తున్నది. అలాగే ప్రత్యేక సమస్యకోసం ఏర్పడి, ఆ సమస్య పరిష్కరించబడిన తరువాతగాని, లేక ఆ పోరాటం ముగిసిన తరువాతగాని రద్దు అయ్యే ఐక్య సంఘటనా కమిటీలనుకూడా చూచాం.

18. కార్యక్రమం, నిర్మాణ స్వరూపం విషయంలో పి. డి. యఫ్. కేంద్ర కౌన్సిలును ఎదుర్కొన్న ప్రతిష్టంభనను పరిష్కరించటానికి యీ అనుభవంయొక్క విలువైన గుణపాఠాలు తప్పక తోడ్పడాలి.

పై అనుభవం దృష్ట్యా ప్రజాతంత్ర గ్రూపులను, వ్యక్తులను అందరిని కూడగట్టి విశాలమైన ప్రజాపుద్యమాన్ని, ప్రజాసంఘాలను నిర్మించేసమస్య తీవ్రంగా ముందుకొస్తున్నది. ఈ శక్తులన్నిటినీ కూడగట్టి పాలకవర్గపార్టీకి వ్యతిరేకంగా ఐక్య సంఘటనను నిర్మించాలంటే పి. డి. యఫ్. ను పునర్నిర్మించాలి.

19. కాబట్టి పి. డి. యఫ్. లోని అనుబంధీయులందరూ కూర్చొని విశాలమైన ఐక్యత, ఐక్య కార్యాచరణ, ప్రాతిపదికగా తక్షణ కార్యక్రమాన్ని రూపొందించాలి.

కమ్యూనిస్టు పార్టీ ఆ కార్యక్రమానికి ఈ క్రింది సూచనలు యిస్తున్నది:

—మిల్లులను మూసివేయటం, పనులనుండి తొలగింపుపై నిషేధం.

—నిరుద్యోగులకు భృతి.

—కూలిపోతున్న పరిశ్రమలకు సహాయం.

—ప్రజాస్వామిక పన్నుల విధానం.

—విదేశాలకు లాభాలను ఎగుమతిచేయడంపై నిషేధం.

గుత్తవ్యాపారస్తుల లాభాలకు గరిష్ట పరిమితి నిర్ణయించడం. ఇలా మిగిలిన డబ్బుతో కార్మికుల జీవన ప్రమాణాన్ని పెంచటం, నూతన పరిశ్రమలను తెరువడం, చిన్న పరిశ్రమలకు సహాయం చేయడం.

—హైద్రాబాదును విభజించి భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు చేయడం.

—రాజప్రముఖు పదవిని, ఆతని భరణాన్ని, జాగీర్దార్లకు, పెద్ద భూస్వాములకిచ్చే నష్టపరిహారాన్ని రద్దుచేయడం.

—బేదఖలీలను అరికట్టి, దీర్ఘకాలపు ఋణాలను రద్దుచేసి, ప్రభుత్వ, గరిష్ట పరిమితికి మించిన భూస్వాముల భూములను ఉచితంగా భూమిలేని వ్యవసాయకూలి, పేద రైతులకు పంచటం.

—నందికొండ పూర్ణాలాంటి ప్రాజెక్టులను, త్వరితం చేయడం, చిన్నప్రాజెక్టులను ప్రారంభించటం.

—రైతుల పంటల ధరలను స్థిరీకరించటం.

—విద్య, వైద్య సౌకర్యాలను విస్తృత పరచటం.

—పూర్తి పౌరసత్వాలను నెలకొల్పడం.

—గృహ పరిశ్రమలకు సహాయముచేయుట, సహకార సంఘములను ప్రోత్సహించుట.

—అడివితెగల ఇతర వెనకబడిన జాతులయొక్క ఆర్థిక, సంస్కృతికాభివృద్ధికొరకు ప్రత్యేక సదుపాయములు కల్పించుట, వారి న్యాయమైన హక్కులను రక్షించుట.

—మైనారిటీ ప్రజలయొక్క న్యాయమైన హక్కులను బలపరుచుతూ వారిని ప్రజాస్వామికోద్యమములోనికి సమీకరించుట.

పై కార్యక్రమాన్ని రూపొందించటానికి, చర్చించటానికి ఒక సదస్సును పిలువాలని కమ్యూనిస్టుపార్టీ భావిస్తున్నది.

20. ఈ కార్యక్రమానికి అనుగుణ్యమైన పి. డి. యఫ్. యొక్క నిర్మాణ స్వరూపం పార్టీల, గ్రూపుల వ్యక్తులయొక్క ఐక్యసంఘటనగానే వుండగలుగుతుంది.

21. కనుక పి. డి. యఫ్. ను నిలబెట్టుటకు, నిర్దిష్టమైన సమస్యలమీద విశాల ప్రజానీకాన్ని సమీకరించుటకు ప్రత్యేక ఐక్యసంఘటన కమిటీలను నిర్మించుటకు, ఐక్య ప్రజాసంఘాలను నిర్మించుటకు, పార్టీని బలపర్చుటకు, అత్యధిక ప్రాముఖ్యత నివ్వాలి.

ఈ మూడు కర్తవ్యాలను ఒకే దఫా నిర్వర్తించుతేనే మన గమ్యానికి దగ్గరగా చేరగలము.



# కార్మికరంగంలో మన కర్తవ్యాలు

1. హైద్రాబాద్ సంస్థానంలో గత మూడు సంవత్సరాల్లో కార్మికోద్యమ పునర్నిర్మాణం, మరియు అభివృద్ధి ఎన్నతగినంతగా జరిగింది. ఈ కాలంలో పెద్దపోరాటాలు జరిగాయి. కార్మికవర్గం అనేక విజయాలను సాధించింది. ట్రేడ్‌యూనియన్ కార్యకర్తలకు అమోఘమైన గుణపాఠాలను చేకూర్చింది. ఈ కాలంలో కార్మికోద్యమ పునర్నిర్మాణం సాధించిన విజయాలను సరిగా అర్థంచేసుకోవాలంటే, అంచనా వేయాలంటే 1951 సంవత్సర ప్రారంభంలో కమ్యూనిస్టు నాయకుల, ట్రేడ్‌యూనియన్ నాయకుల, మరియు కార్యకర్తల విడుదలతో ప్రథమసారిగా కార్మికసంఘాల పునర్నిర్మాణం జరుగుతున్న రోజుల్లో కార్మికరంగంలోని పరిస్థితినిగురించి సరైన అంచనా వుండటం అవసరం.

2. 1951 సంవత్సర ప్రారంభంలో ఎ. ఐ. టి. యు. సి. తో సంబంధంవుండి పనిచేస్తూవుండిన యూనియన్ ఏ ఒక్కటీ లేదు. కమ్యూనిస్టుపార్టీపై, కార్మికసంఘాల అగ్రశ్రేణి నాయకత్వంపై కొనసాగుతూవున్న తీవ్రనిర్బంధాన్ని ఉపయోగించుకొని ఐ. యన్. టి. యు. సి., హెచ్. యమ్. యస్. సంస్థలు ఎ. ఐ. టి. యు. సి. కి సంబంధించిన సంఘాలన్నిటినీ తమ ఆధ్వర్యంలోకి తీసుకొనుటలో సఫలులయ్యారు. కార్మికరంగంలో హెచ్. ఎమ్. యస్. ప్రధానశక్తిగా వుండింది.

ఇంచుమించు అన్ని కార్మిక కేంద్రాలు దాని అధీనంలో వుండినవి. దీనితర్వాత ఐ. యన్. టి. యు. సి. స్థానం వుండింది. కార్మిక రంగంలో చీలికలు, గందరగోళం తీవ్రతరంగా కొనసాగుతుండి నవి. 1945-'46 లో కార్మికవర్గంలో పెద్దవెల్లువ వచ్చింది. కార్మికులు పెద్దయెత్తున సమీకరించబడ్డారు. ఈ కాలంలోనే కార్మికవర్గం అనేక విజయాలను సాధించింది. ఇవే గొప్పవి, ఆఖరివిగూడాను. నాటినుండి నేటివరకు అక్కడక్కడ కొన్ని మినహా అలాంటి పెద్ద విజయాలు సాధించబడలేదు. ఈ వెల్లువ, దానితోపాటు సాగించిన పోరాటాలు ఎ. హెచ్. టి. యు. సి. ఉద్భవానికి కారణభూతమయ్యాయి. కార్మికులు పెచ్చు పెరిగిన దుర్భరపరిస్థితిలో బాధపడుచుండిరి. 1950 లో హెచ్. ఎమ్. యస్. నాయకత్వాన జరిగిన జనరల్‌సమ్మె విఫలం పొందడంతో హెచ్. ఎమ్. యస్. నాయకత్వంపట్ల కార్మికుల్లో తీవ్రఅసంతృప్తి, వ్యతిరేకత పెరిగింది. కార్మికులకు సరైనమార్గం దొరకలేదు. సనత్‌నగర్, రాంగోపాల్ మిల్లు కార్మికుల పోరాటాల వైఫల్యంవల్ల ఐ. యన్. టి. యు. సి. ఆంతరంగిక సంక్షోభానికి గురైంది. స్టేటు కాంగ్రెసులో చెలరేగిన గందరగోళం (Strife) దీనియొక్క ప్రతిబింబమే.

3. ప్రభుత్వంచే నియమించబడ్డ రీగే కమిటీ సిఫారసుల వల్ల కార్మికవర్గం ఆర్థికంగా సాధించింది చాలాతక్కువ. ఈ సిఫారసులు ప్రత్యేకంగా ప్రభుత్వ అధీనంలోని ఫ్యాక్టరీ కార్మికులకొరకు వున్నప్పటికీ, వారికీ, ఇతర కార్మికులకుగూడా ఏమాత్రము సంతృప్తి కల్గించలేకపోయినవి. హైద్రాబాద్‌లో 1951

ప్రారంభంలో వివిధ తెగలకు (Categories) చెందిన కార్మికుల సగటు ఆదాయం, భారత దేశంలోని యితర ప్రాంతాలతో, చుట్టు పట్లవున్న పారిశ్రామిక కేంద్రాలతో పోల్చిచూస్తే చాలా తక్కువ.

4. ఉద్యోగములో వున్నవారి ఆదాయాలు తక్కువగా వుండడమేగాకుండా, నిరుద్యోగుల సంఖ్య చాలా తీవ్రంగా పెరిగింది. ఇదేగాకుండా పోలీసుచర్యానంతరం పోలీసు, మిలిటరీ సిబ్బందిలో జరిగిన రిట్రెంచిమెంటు ఫలితంగా, ప్రభుత్వ డిపార్టు మెంటుల్లో వచ్చిన మార్పులఫలితంగా, ప్రత్యేకంగా హైద్రాబాద్‌లోని మధ్యతరగతి, క్రింది మధ్యతరగతి వర్గాల్లో నిరుద్యోగులసంఖ్య అపారంగా పెరిగింది. దీనిఫలితంగా కార్ఖానాల్లో, మరియు చిన్నచిన్న కంపెనీలు, మిల్లులు, షాపులు మొదలగు వాటిలో జరుగుతూవచ్చిన రిట్రెంచిమెంటు, రేషనలైజేషన్, పనిభారం ఎక్కువగుటమూలాన పారిశ్రామిక నిరుద్యోగుల సంఖ్య పెరుగుతూవచ్చింది.

5. ఈ పరిస్థితుల్లో 1951 సం॥ ప్రారంభంలో కార్మిక సంఘాల పునర్నిర్మాణం ప్రారంభమైంది. కమ్యూనిస్టుపార్టీ నాయకులు, ట్రేడ్‌యూనియన్ నాయకులు విడుదలైన కొద్ది రోజుల్లోనే జనరలు ఎన్నికలు వచ్చాయి. ప్రజలు రాజకీయంగా పెద్దఎత్తున కదిలారు. సమీకరించబడ్డారు. వీరితో కార్మికవర్గం కూడా కదిలింది. ఎన్నికలకాలంలో షాబాద్, నాందేడ్, వరంగల్, కొత్తగూడెం, ఔరంగాబాద్ మరియు హైద్రాబాద్, సికింద్రాబాద్ నగరాలలో కార్మికులు పెద్దఎత్తున కదిలారు. పి. డి. యఫ్. కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థులను బలపర్చారు.

వారి మీటింగులు విజయవంతంగా సాగుటకు తోడ్పడ్డారు. ఈ అమోఘ ప్రజాసమీకరణ కాలంలోనే ఎ. ఐ. టి. యు. సి. యూనియన్ల పునర్నిర్మాణం జరిగింది. ఎన్నో కొత్తసంఘాలు ఎ. ఐ. టి. యు. సి. ఆధ్వర్యం క్రిందకు తేబడ్డాయి. ఎందరో పార్టీనైపుకు వచ్చారు.

6. అప్పటినుండి ఎ. హెచ్. టి. యు. సి. రంగంలో వుంది. ఈ కాలంలో పెరుగుతున్న కార్మికపోరాటాలకు నాయకత్వం వహించి నడుపుతూ వచ్చింది. అందులో మొదటిది 1952 లో 45 రోజులు కొనసాగిన షాబాద్ సిమెంటు కార్మికుల సమ్మె. దీనితర్వాత ఎ. ఐ. టి. యు. సి. కి సంబంధించిన సంఘాలు అనేక వీరోచితపోరాటాలు జరిపాయి. హట్టి బంగారు గని కార్మికుల పోరాటం; కొత్తగూడెం గనికార్మికుల పోరాటం, పాత గిర్నీ కార్మికుల పోరాటం, జిందాతిలస్మాత్ కార్మికుల పోరాటం, ఆర్మూరు, ఔరంగబాద్ బీడికార్మికుల పోరాటాలు, మరియు ఎ. హెచ్. టి. యు. సి. తో స్నేహసంబాధాలు గల ఆర్. టి. డి. కార్మికులు తమ యూనియన్ నాయకత్వాన వీరోచిత పోరాటం సాగించారు.

7. దీనిఫలిత మేమంటే సంస్థానంలో ఎ. హెచ్. టి. యు. సి. ప్రప్రథమ ట్రేడ్‌యూనియన్ కేంద్రసంస్థగా రూపొందినది. హింద్‌మజ్దూర్ సభ, జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు వరుసగా రెండవ, మూడవ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. చివరి రెండు కేంద్రసంస్థల సమిష్టి సంఖ్యాబలం కంటే ఎ. హెచ్. టి. యు. సి. యొక్క సంఖ్యాబలమే హెచ్చుగా వుందని గట్టిగా చెప్పవచ్చును. కాని హైద్రాబాద్,

సికింద్రాబాద్ జంటనగరాల్లో మాత్రం హెచ్. ఎమ్. యస్., ఐ. యన్. టి. యు. సి. సంఖ్యాబలం ఎ. హెచ్. టి. యు. సి. కంటే హెచ్చుగా వుందనే విషయం గుర్తించుకోవాలి.

8. తదితర తెలంగాణాజిల్లాల్లోని పరిస్థితి మరింత అధ్వాన్నంగా వుంది. సింగరేణి కాలరీస్‌లోని కొత్తగూడెం, ఎల్లందు యూనియన్‌లు, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్, ఆర్మూర్, నిజామాబాద్‌లు మినహా తెలంగాణాపట్టణాల్లో ట్రేడ్ యూనియన్లేవీ లేవనే చెప్పవచ్చు. ఇక సిర్పూర్ కాగజ్‌నగర్, బెల్లంపల్లి, రామగుండం, బోధన్ కార్మిక కేంద్రాలు హెచ్. ఎమ్. యస్., ఐ. యన్. టి. యు. సి. చేతుల్లో వున్నవి.

9. దానివల్ల ట్రేడ్‌యూనియన్ వుద్యమంయొక్క రెండు లక్షణాలు స్పష్టమౌతున్నవి. కార్మికవర్గ సమీకరణకు ప్రధానపోరాట శక్తిగాను, యజమానులనుండి హక్కుల సాధనలో ప్రత్యేక సంఖ్యాప్రాముఖ్యత కలిగిన బలమైన కార్మిక కేంద్రాలు స్టేటులోని మూడు కేంద్రసంస్థల మధ్య విభజింపబడి, రైల్వే ఆర్. టి. డి. మరియు పోస్టు అండ్ టెలిగ్రాఫ్ సంస్థలవంటివి స్వతంత్రంగా వుండిపోయినవి. ఇది మొదటిలక్షణం; ఇక రెండవ ముఖ్యమైన లక్షణ మేమంటే అత్యధికసంఖ్యలో కార్మికవర్గం అందులో ప్రధానంగా మోటు కష్టంచేసే కార్మికవర్గం అధికంగా ఏ నిర్మాణంలోనూ లేకుండానే వుండిపోయింది.

10. గత మూడు సంవత్సరాల్లోను కార్మికవర్గం అనేక గొప్పపోరాటాలు చేసింది. ఈ పోరాటాలన్నిటిలోనూ వచ్చిన ఒకే ఒక అనుభవం ఏమంటే ఈ పోరాటాలన్నీ ఎ. హెచ్.

టి. యు. సి. లేదా హెచ్. ఎమ్. యస్. లేదా ఐ. యన్. టి.యు. సి. నాయకత్వాన జరిగినా లేదా స్వతంత్రంగాయున్న సంఘాలచే నడుపబడినా, ఆ పోరాటాలన్నీ స్పష్టమైన, నిర్దిష్ట మైన వర్గకోర్కెల ఆధారంగా జరిగినవే. ఇందుకు అనేక ఉదాహరణలు చూపవచ్చు. స్టేటులోని అన్ని బట్టల పరిశ్రమల కేంద్రాల్లోనూ రేషనలైజేషన్, పనులనుండి తొలగింపు, పని భారం పెంపుదలకు వ్యతిరేకంగా పోరాటాలు జరిగినవి. బోనసు సమస్యపై ఆర్. టి. డి. ఎలక్ట్రిక్ డిపార్టుమెంటు, డిస్టిలరీ, బట్టల మిల్లుల్లో జరిగినవి. కెమికల్స్, బీడి, మున్సిపాలిటీలలో జీతాల పెంపుదలకోసం జరిగినవి. యూనియన్ హక్కులను కాపాడుకునేటందుకు యజమానులు కక్షతో పనులనుండి ముఖ్య ట్రేడ్ యూనియన్ కార్యకర్తలను తొలగించినందుకు వ్యతిరేకంగా హట్టి, షాబాద్, సనత్‌నగర్, సిర్పూర్-కాగజ్ నగరులలో జరిగినవీ, అధికధరల హెచ్చింపు, చౌక గృహావసతి, నిరుద్యోగ భృతి, సెలవులు, విశ్రాంతి, వైద్యసౌకర్యం, గ్రాట్యూటీ, ముసలితనపు పెన్షన్‌వంటి సాంఘికరక్షణ సమస్యలపై జర్గిన పోరాటాలు యివన్నీ పై తరగతికి చెందినవే. ఈ పోరాటాలలో చాలా భాగం కొన్నిచోట్ల జీతాల హెచ్చింపు రూపంలోనూ, పనుల నుండి తొలగింపు, రేషనలైజేషన్‌ల దాడి ముమ్మరాన్ని కొంతవరకు అరికట్టడంలోను సఫలత సాధించినవి.

11. ఈ పోరాటాలన్నిటిలోనూ వారే కేంద్ర సంస్థలకు అనుబంధంగా వున్నవారైనా, స్వతంత్ర సంఘాల్లో వున్న వారైనాసరే కార్మికులు తీవ్ర నిర్బంధవిధానాన్ని ఎదుర్కొన్నారు. గత రెండు సంవత్సరాల్లోనూ 500 మంది కార్మిక కార్యకర్తలు

అరెస్టుచేయబడినారు; 1000 మంది గాయపడ్డారు. వివిధ కార్మిక కేంద్రాల్లో 7 సార్లు 144 సెక్షన్ పెట్టబడింది.

20 సార్లు లాఠీచార్జీలు, రెండుసార్లు కర్ఫ్యూలు, మూడుసార్లు కాల్పులు, నాల్గుసార్లు బాష్పవాయువు ఉపయోగించబడ్డాయి.

12. అయితే యీ పోరాటాలన్నీ హక్కులు సాధించే కొరకు, విశాలమైన, ఐక్యమైన, మరింత గట్టి పోరాటాల ఆవశ్యకతను రుజువుచేశాయి. బట్టలపరిశ్రమలో రేషనలైజేషన్ సమస్య, గవర్నమెంటు పరిశ్రమల్లోనూ, సంస్థల్లోనూ బోనసు కోసం జరిగే పోరాటం, మూసివేయబడిన, మూసివేయబడనున్న పరిశ్రమల తిరిగి ప్రారంభించుట, అదనపు పెట్టుబడుల వల్ల, దుబారా వ్యయంవల్ల, లంచగొండి విధానంవల్ల దివాళా దశలో వున్న సనత్ నగర్ పరిశ్రమలు, వేతన నిర్ణాయక కమిటీలద్వారా సక్రమమైన న్యాయసమ్మతమైన జీతాలు సాధించడం, ఆ కమిటీల సూచనల నమలుజరిపించడం, అధిక ధరల అలవెన్సులను అసలు జీతాలతో కలిపివేయడానికి జరిపే పోరాటం, నిరుద్యోగ సమస్యా పరిష్కారం, తాత్కాలిక సహాయభృతి సంపాదించుట, వీటన్నిటికంటే ముఖ్యంగా ట్రేడ్ యూనియన్ హక్కుల రక్షణకొరకు సాగించవలసిన పోరాటాలు ప్రముఖమైనవి, తక్షణమైనవి. కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థలు, స్వతంత్రంగావున్న సంస్థలుకూడా యీ సమస్యలన్నిటిపైననో, కొన్నిటిపైననో పోరాటాలు జరిపినవి. అయితే ఇంతకంటే బలంగా, గట్టిగా విశాలప్రాతిపదికపై ఎలా పోరాడాలనే సమస్య మనముందున్నది.

13. సమస్యలకు ఈ, ఆ సంస్థలనే పరిమితులు, హద్దులు లేనట్లే, పోరాటాలుగూడా అన్ని కార్మికసంస్థల ద్వారాను నడుపబడుతున్నవి. ఎ. ఐ. టి. యు. సి. నాయకత్వానవున్న షాబాద్, హట్టి, కొత్తగూడెం, పాతగిర్నీ, జిందాతిలస్మాత్, సికింద్రాబాద్ హోటలువర్కర్సు, ఔరంగాబాద్ బీడీకార్మికుల కార్మిక కేంద్రాల్లోనేగాక మజ్‌దూర్‌సభ పనిచేస్తున్న బెల్లంపల్లి, జాల్నావంటి ప్రాంతాల్లోను, ఐ. యన్. టి. యు. సి. పనిచేస్తున్న సిర్పూర్ - కాగజ్‌నగర్, తాజ్ గ్లాస్ ఫ్యాక్టరీ, సర్వేఖాసు వుద్యోగులు, వ్యవసాయ ఫారం (అగ్రికల్చరల్ ఫార్మ్) వుద్యోగుల కేంద్రాల్లో, మరియు ఆర్. టి. డి. లో దృఢమైన పోరాటాలు జరుగుతున్నవి. కాగా ఈ పోరాటాల పటుత్వం మరియు అన్ని తరగతులకు చెందినవారి కోర్కెలు వుండుటవల్ల అందరికంటె వెనుకబడిన కార్మిక సెక్షన్లతోసహా మొత్తంమీద కార్మికులందరిచొరవతోనే ఇవిసాధ్యమగుచున్నవి. అందుకే కామ్రేడ్ లూయియీ సాయిలాన్ చెప్పినట్లు కార్మిక వర్గం పోరాటాలకు తలపడిన ప్రతిచోటా ఆ యా యూనియన్లు ఏ కేంద్రాలతో అనుబంధింపబడి వున్ననైనా ప్రపంచ కార్మిక సమాఖ్య వానికొక వేదికగా పరిణమించడం జరుగుతూవుంది.

14. ఇక సర్వసామాన్య కార్మికులంతా యీలాంటి చొరవను, పటిమను ప్రదర్శిస్తున్నప్పటికీ ఐక్య కార్యాచరణకు వారు దిగకుండా ఆటంకపరుస్తున్నదేమి? అన్ని కేంద్రసంస్థలకు సంబంధించిన యూనియన్ల ఐక్యసంఘటనకుగల ప్రతిబంధక మేమిటి? కార్మికవర్గ ఐక్యతకు, ఐక్యకార్యాచరణకు ఆటంకంగా వున్న విషయాలేమిటి? పరిశీలించాలి.

15. ఇందులో స్పష్టంగా కనుపించే ప్రధాన ఆటంకం ఎ. హెచ్. టి. యు. సి. తో ఐక్యకార్యాచరణను వ్యతిరేకించే ఐ. యన్. టి. యు. సి. మరియు హెచ్. యం. యస్. సంస్థల నాయకత్వాలలోని కొన్ని భాగాల పిడివాదధోరణి అని చెప్ప వచ్చు.

16. అయితే ఇదే అన్నిటికంటే ముఖ్యమైనది మాత్రం గాదు. విడివిడిగా ఒక్కొక్క యూనియన్‌లోను ఆ ప్రత్యేక సమస్యపై పోరాటంలో ప్రదర్శితమయ్యే సమైక్యత యితర యూనియన్‌లతో కలిపి జరిపే పోరాటాలవైపు మరలడంలేదు. ఈ విధంగా ఇతర యూనియన్లతోసహా కలిసి పోరాడే సమై క్యత యేర్పడినప్పుడే ఆ యా నాయకత్వ భాగాల పిడివాద ధోరణి, మొండితనపు విధానాలు ఓడించబడ గలవు.

17. మన అనుభవంలోనే మార్చి '53 లో సిక్కారద్దు సందర్భంలో వచ్చిన పోరాటాల్లోనూ, ఏప్రిల్, మే మాసాల్లో సిర్పూర్ కాగజ్‌నగరు కార్మికుల పోరాటాల్లోనూ సమైక్యత ప్రదర్శించి ఎ. ఐ. టి. యు. సి. యూనియన్లు కదిలినప్పుడు, కార్మికవర్గ ఐక్యత, ఐక్యకార్యాచరణ అనే సమస్యలు స్పష్టంగా కార్మికలోకం ముందుకొచ్చినవి. కొంత పురోగమనం కూడా జరిగింది. అదే సందర్భంలో ఎ. హెచ్. టి. యు. సి. మరియు ఐ. యన్. టి. యు. సి. నాయకత్వాలు కొంత కల్సివచ్చి ఆల్ ట్రేడ్ యూనియన్స్ కాన్ఫరెన్సులో సమావేశం కావడానికి అవకాశం లభించింది. ఒక సమన్వయ కమిటీగూడా ఏర్పడింది. కాని క్రిందినుండి పైదాకా ట్రేడ్ యూనియన్ కార్య కర్తలు ఈ సదవకాశాన్ని సమయానికి ఉపయోగించుకోలేక

పోవడం, ఐ. యన్. టి. యు. సి. నాయకత్వంపై అధికార పార్టీలోని హైకమాండు ఒత్తిడి రావడంతో పైన సాధింప బడిన ఈ సమైక్యత తిరోగముఖంపట్ట నారంభించింది.

18. ఈ రోజు మనకు కనుపించేదేమంటే సమన్వయ కమిటీని పనిచేయించాలని ఎ. హెచ్. టి. యు. సి. కోరుతూంటే ఐ. యన్. టి. యు. సి. నాయకులు తప్పుకు తిరగడమే గాకుండా, ఎ. హెచ్. టి. యు. సి. నాయకత్వంపై అభాండాలు వేస్తున్నారు. తమ ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలలో కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారాన్ని ప్రధాన భాగంగా చేసుకుంటున్నారు. కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం మట్టుకే ఆగకుండా ఎ. హెచ్. టి. యు. సి. నడిపిన ప్రధాన పోరాటాలన్నింటిలో కార్మికవర్గం తీవ్రంగా నష్టపడిందని ప్రచారంచేస్తూ వెనుకబడిన కార్మిక తరగతుల్లోని ఊగిసలాట తత్వాన్ని ఉపయోగించుకో జూస్తున్నారు. రాను రాను వారు కార్మిక పోరాటాలను ఇంకా గట్టిగా వ్యతిరేకిస్తున్నారు. వారి ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలు మంత్రులవద్దకు రాయబారాలు నడుపడం, కొన్ని పరిస్థితుల్లో తాము పెట్టిన డిమాండ్సును అంగీకరించనిచో, కార్మికులంతా కమ్యూనిస్టుల చేజిక్కుతారని ప్రభుత్వాన్ని బెదరించడంవరకే పరిమితమగుచున్నవి. ఇక కొందరు ఐ. యన్. టి. యు. సి. నాయకులు, స్టేటుకాంగ్రెసులోని నాయకత్వపు ముఠాలమధ్య అవకాశవాద ధోరణిలో దోబూచు లాడుతున్నారు. అధికారవర్గంలోవున్న పార్టీ నాయకుల్లో కొందరప్పుడే హట్టి, నాందేడ్ లాంటి ప్రాంతాల్లో పోటీ సంఘాలు నిర్మిస్తున్నారు. ఈ పై నాయకత్వం

ఆశీర్వాద బలంతోనే ఎ. హెచ్. టి. యు. సి. యూనియన్లకు పోటీగా షాబాద్, కొత్తగూడెం, హైద్రాబాద్ డైరినేజి కార్మికుల్లోనూ, మజ్దూర్ సభ యూనియన్లకు వ్యతిరేకంగా బోధన్, మరియు ఎలక్ట్రిసిటీ కార్మికుల్లోను పోటీసంస్థల నిర్మాణానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

19. ఐ. యన్. టి. యు. సి. నాయకత్వం పైస్థాయిలో ఈ ఎత్తుగడ లవలంబిస్తున్న పరిస్థితుల్లో క్రింద సామాన్య కార్మికులు యిటు ప్రభుత్వం, అటు యజమానుల దాడికి గురి అవుతున్నారు. సిర్పూరు కాగజునగరులో పెద్దఎత్తున ముఖ్య ట్రేడ్ యూనియన్ కార్యకర్తల తొలగింపుకు ప్రయత్నం జరుగుతూవుంది. అస్‌బెస్టాస్‌లో పారిశ్రామిక కోర్టుతీర్పును సహితం యజమానులు అమలు జరుప నిరాకరిస్తున్నారు. జీతాలకోతకు, కార్మికుల తొలగింపుకు కార్మికులను లొంగదీసేటందుకే తాజ్ గ్లాస్‌ఫ్యాక్టరీ మూసివేయబడింది. డిస్టిలరీస్‌లో ఇదివర కివ్వబడుతున్న బోనసు యిప్పుడు ఇవ్వ నిరాకరిస్తున్నారు. నాయకత్వంలో పై వర్గాలీవిధంగా వ్యవహరిస్తుంటే సామాన్య కార్మికుల్లో దినదినం అసంతృప్తి హెచ్చుతూవుంది.

ఇందువల్ల ఐ. యన్. టి. యు. సి. లోను, దాని అనుబంధ సంస్థలోను ఒక తీవ్రమైన పరిస్థితి యేర్పడివుంది.

20. అదే విధంగా హింద్ మజ్దూర్ సభలో నిర్మాణింపబడిన కార్మికులు, బెల్లంపల్లి, ఎలెక్ట్రిసిటీ శాఖలో బోనసు సమస్య, ఆజంజాహిమిల్లులోను, గుల్బర్గాలోను రేషనలైజేషను సమస్య, బోధన్‌లో నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు విచ్ఛిన్నానికి వ్యతిరేకంగా యూనియన్‌ను రక్షించే

సమస్యలలాంటి తీవ్రమైన వాటిని ఎదుర్కొంటున్నారు. ఈ సమస్యలన్నీ నిశ్చితమైన ఐక్య పోరాటం యొక్క ఆవశ్యకతను సూచిస్తున్నవి. కాని సోషలిస్టు నాయకులు తమ ట్రేడ్ యూనియన్ వేదికను, సోవియట్ ద్వేషము, కమ్యూనిస్టు దూషణలకు ఉపయోగించే విధానాన్ని ఎల్లప్పుడూ అనుసరిస్తూ వస్తున్నారు. ఆల్ హైదరాబాద్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు నాయకత్వాన ఉన్న కొత్తగూడెం, షాబాద్, హుట్టీ, పాతమిల్లు లాంటిచోట్ల ఉన్న కార్మికులు, ఆఖరుకు స్వతంత్ర యూనియన్‌లో ఉన్న ఆర్. టి. డి. కార్మికులు, నిశ్చితమైన పోరాటాలను చేస్తున్నప్పుడు ఆ పోరాటాలపై దుష్ప్రచారం సాగించి, విచ్ఛిన్నం చేయడంలోను, కార్మికులను దూషించడంలోను వారు సకల ప్రయత్నాలు గావించారు. ఆజంజాహి, పాతమిల్లు లాంటిచోట్ల కమ్యూనిస్టు, ఆల్ హైదరాబాద్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్యకర్తలను కొట్టడంలాంటి గూండాపద్ధతులను గూడా చేపట్టారు. సోషలిస్టు నాయకులయొక్క యీ విధానా లెలా ఉన్నా హింద్ మజ్దూర్ సభ నాయకత్వాన ఉన్న కార్మికులలో ట్రేడ్ యూనియన్ ఐక్యత, ఐక్య కార్యాచరణ కావాలనే వాంఛ ప్రబలంగా ఉంది. అందువల్లనే అనిష్టంగా ఐనప్పటికీ, "ప్రజాస్వామిక యూనియన్ల"తో ఐక్యతకోసం వారు తీర్మానించవలసి వచ్చింది.

21. ఈ విధంగా ట్రేడ్ యూనియన్ రంగంలో తీవ్రమైన పరిస్థితి యేర్పడింది. సమస్యలయొక్క తీవ్రత, పోరాటాల అవసరాలు, కార్మికుల జీవితానుభవం అన్నీకూడా, హక్కుల

సాధనకోసం ట్రేడ్ యూనియన్ ఐక్యతను పోరాటంలో ఐక్యతను డిమాండు చేస్తున్నవి. నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ నాయకులు తాము నిర్మించుకున్న అడ్డుగోడలను తొలగించుటకు గుడ్డిగా తిరస్కరిస్తున్నారు. ఆల్ హైద్రాబాద్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌తో సహా అన్ని ట్రేడ్ యూనియన్లలోనువున్న సాధారణ కార్మికులందరు దీనిని గుర్తించి చొరవ ప్రదర్శించడంవల్లమాత్రమే తమలోని ఈ విభజన పోగొట్టబడుతుంది. కమ్యూనిస్టులు, నిజాయితీపరులైన ట్రేడ్ యూనియనిస్టులు అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, ప్రపంచ కార్మిక సమాఖ్యల స్నేహితులు, అనుబంధితులు అందరూ సాధారణ కార్మికులనుంచి యీ చొరవ పెల్లుబుకుటకు ప్రయత్నించవలెను. ఇలా సాధించబడవలెనన్న మనం మనపనిని విమర్శనా పూర్వక దృష్టితో పరిశీలించుకొని లోపాలను సరిదిద్దుకొనవలసి వున్నది.

22. ట్రేడ్ యూనియన్స్‌లో మనపనినిగురించి చేసుకునే సక్రమమైన పరిశీలన మనలో సెక్టేరియన్ భావావశేషాలున్నవని తెలుపుచున్నది. ఈ సెక్టేరియన్ దృక్పథం ఒక యూనియన్‌ను నిర్మించడం, దానిని పనిచేయించడం సందర్భాలలోను, ట్రేడ్ యూనియన్ ఐక్యత అనే సమస్యయెడలవున్న వైఖరిలోను ద్యోతకమౌతుంది.

23. ఆఖరుకు కమ్యూనిస్టులు నాయకత్వ స్థానాలలో ఉన్న చాలా యూనియన్లలోని సాధారణ కార్మికుల చొరవ తీవ్రమైన పోరాటాలసందర్భంలోనే ప్రదర్శించబడుతుంది. నాయకుడు, ప్రజలు అనే స్పష్టమైన పద్ధతిపైన ఆ యూనియన్లు

నడుస్తున్నవి. అంటే యాక్టివ్ నాయకులు, కదలికలేని కార్మికులు, నాయకులు నిర్ణయం చేస్తారు. ఆ నిర్ణయాన్ని కార్మికులు అమలుజరుపుతారు. ఈపద్ధతి సాధారణ ట్రేడ్ యూనియనిస్టుల అభివృద్ధికి, చొరవకు ఆటంకంగా తయారవుతుంది. ఫలితమేమంటే ట్రేడ్ యూనియనుల అభివృద్ధి కుంటుపడుతుంది. ఆల్ హైద్రాబాద్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో ఉన్న అనేక సంఘాలలోనైతం నూటికి 35 నుంచి, 50 వరకు మాత్రమే పరిశ్రమ కార్మికులు సభ్యులుగా చేర్చబడ్డారు. రోజువారీగాను, ప్రజాస్వామికంగాను, నిత్యము యూనియన్‌ను పని చేయించే విధానంపై శ్రద్ధవహించడంలేదు. కోరికలు రూపొందించేటప్పుడు, పోరాటాలు నడిపేటప్పుడు వెనుకబడ్డ కార్మికుల యొక్క అవసరాలయెడ, మన స్థితియెడల సక్రమమయిన శ్రద్ధ చూపటంలేదు. ఏ కార్మికుల ప్రయోజనాలను ఆ సంఘం కాపాడుతున్నదో ఆ కార్మికుల నిజమైన ప్రాతినిధ్య సంఘంగా అది అభివృద్ధి చెందుటకు యెన్నికలు జరిగేటప్పుడు అన్ని తరగతుల కార్మికులకు, గ్రూపులకు, అభిప్రాయాలకు కార్యవర్గంలో ప్రాతినిధ్యం ఉండునట్లు చూడడంలేదు. చాలా మంది ట్రేడ్ యూనియన్ నిర్వాహకులు తామున్న పరిశ్రమపైన, వివిధ కార్మిక శాసనాలపైన పట్టుసంపాదించుటకు శ్రద్ధవహించటంలేదు. ట్రేడ్ యూనియన్ నిర్వాహకులు, కార్యకర్తలు యీవిషయాలపై తగుపట్టు సంపాదించడం అత్యావసరం.

24. ట్రేడ్ యూనియన్స్‌ను నిర్వహించడంలో మరొక తీవ్రమైన లోపమేమంటే వారు తమ యూనియన్‌లో నిర్మాణయుక్తమైన నిరంతర కార్యాచరణకు చైతన్యయుతంగా పని

చేయకపోవడం మనం పనిచేసే సంఘాలు పోరాటాల సమయ మప్పుడే చురుకుగా ఉంటున్నవి. మిగతా సమయాలలో స్వల్పమైన కార్యాచరణ మాత్రమే ఉంటున్నది. ట్రేడ్ యూనియన్లలో వివిధరకాల కార్యాచరణను చేపట్టాలని ఆ నిరంతర కార్యాచరణ డిమాండు చేస్తూంది. ట్రేడ్ యూనియన్ విధిగా తీసుకొని పనిచేయవలసిన రోజువారీ వ్యక్తిగత కోర్కెలతోపాటు సాధారణ, రాజకీయ, పరిజ్ఞానాన్ని కార్మికులకు అందివ్వవలసినచోట్ల శిక్షణాకేంద్రాలను వయోజనవిద్య సహకార సంఘాలు, మునిసిపల్, బెనిఫిట్ ఫండు సంఘాలు లాంటి సాంస్కృతిక రిలీఫ్ కార్యక్రమాలను తీసికొని పనిచేయ వలసి యున్నది.

25. పచ్చినిస్సారమైన ఆర్థికవాదం మన ట్రేడ్ యూనియన్ కార్యక్రమంలో మరొక తీవ్రమైన లోపంగా ఉంటున్నది. నిర్దిష్టమైన సదుపాయాలు సాధించడానికి కార్మికులను నిశ్చిత పోరాటాలలోకి కదిలిస్తాం. కాని కార్మికులు మరింత విశాలమైన, మరింత నిశ్చితమైన పోరాటాలు చేయుటకు వారిలో రాజకీయ ప్రచారం సాగించడంలోను, వారి రాజకీయ చైతన్యాన్ని పెంపొందించుటలోను విఫలమౌతున్నాం. రాజప్రముఖు పదవి, అతని భరణం రద్దు, భాషాప్రయుక్త రాష్ట్రాలు మొదలైన రాజకీయ సమస్యలపైన కార్మికులను, కార్మిక సంఘాలను కదలించడంలో యీ సమస్యలను వారి రోజువారీ కోర్కెలతో జతపరచడంలోనూ నిశ్చితమైన ప్రయత్నాలు చేయడం లేదు.

మనం కార్మికవర్గాన్ని వారి కోర్కెల పోరాటాల సంకుచిత పరిమితుల్లోనే వుంచుతూవచ్చాం. ఇతర తరగతుల ప్రజల పోరాటాలకు అండగా కార్మికవర్గాన్ని కదిలించుటకై మనం చైతన్యవంతంగా ప్రయత్నించలేదు. దీని కొక్క మినహాయింపు మాత్రంవుంది. అది, మార్చి 1952 లో అమ్మకపు పన్ను (Sales tax) కు వ్యతిరేకంగా జరిగిన పోరాటసందర్భంలో హైద్రాబాద్‌లో మనం కార్మికుల వూరేగింపు తీశాం. వీటన్నిటికన్న ముఖ్యంగా మనం శాంతిఉద్యమాన్ని కార్మికవర్గంలోకి తీసుకెళ్ళటంలో విఫలులమయ్యాం. చివరకు అమెరికా, పాకిస్థాన్ సైనిక ఒడంబడికవల్ల మన దేశ భద్రతకే తీవ్ర అపాయమేర్పడి దీని ఫలితంగా యావద్భారతదేశంలో ప్రజలంతా కదులుతున్న సమయానగూడా మనం కార్మికవర్గాన్ని ఈ ఉద్యమంలోకి సమీకరించలేదు. కార్మికవర్గ పోరాటాలు అవి వారి కోర్కెల గురించి యైనప్పటికీ మన ప్రజలను ఎంతగా ఉత్తేజపరుస్తాయో మన మెరుగుదుము. షాబాద్, హుట్టి, కొత్తగూడెం, ఆర్. టి. డి. సమ్మెలు రైతులను చాలా ఉత్తేజపర్చాయి. వీరు కార్మికుల సహాయానికై కదిలారుకూడా. ఈ విధంగా కార్మికవర్గ పోరాటాలు మన ప్రజావుద్యమాలకు స్వరూపం, మార్గం యిచ్చుటకు కారణభూతమైనప్పుడు కార్మికవర్గం ఇతర వర్గాలకు ప్రత్యేకంగా రైతువర్గానికి అండగా కదిలిన యెడల ఈ వర్గాలు యెంతో ధైర్యసాహసాలను పొందటమే గాకుండా కార్మికవర్గం ఇతరవర్గాల ప్రజలమధ్య, ప్రత్యేకంగా రైతు కార్మికుల మధ్య ఐక్యత ఏర్పడి, కార్మికవర్గం – పోరాటాలు సాగి

స్తున్న మన ప్రజానీకంయొక్క నాయకుడుగా ముందుకు రాగల్గిన రైతు కార్మికుల ఐక్యత పునాదిగాయున్న విశాల ఐక్యసంఘటనకు మార్గం ఏర్పడుతుంది.

26. ట్రేడ్ యూనియన్ ఐక్యత గురించి మనలోనున్న సెక్టేరియన్ దృక్పథం ఈ సమస్యపై కార్యకర్తల చొరవను అరికట్టుతుంది. ఒక విధంగా విచ్ఛిన్నకారుల సిద్ధాంతాన్ని ఒప్పుకునే దృక్పథం కనపడుతుంది. ఈ సిద్ధాంతం ప్రకారం దేశంలో ఎన్ని రాజకీయపార్టీలు, సిద్ధాంతాలు వున్నాయో అన్ని ట్రేడ్ యూనియన్ సెంటర్లు వుండటంకూడా తప్పనిసరి. ఈ సిద్ధాంతరీత్యా అన్ని ట్రేడ్ యూనియన్లలోను నాయకత్వ స్థానాలలో కమ్యూనిస్టులు వున్నప్పుడు మాత్రమే ట్రేడ్ యూనియన్ ఐక్యత సాధ్యం. అంటే అన్ని ట్రేడ్ యూనియన్లు కమ్యూనిస్టు నాయకత్వాన లేక కమ్యూనిస్టు కమిటీల నాయకత్వాన పనిచేస్తున్న పక్షంలోనే అది సాధ్యమవుతుంది. ఈదృక్పథం ఇంత మొరటుగా కనబడకపోవచ్చు. కాని దానివల్ల కార్మికులెక్కడున్నప్పటికీ వారి సంఘాలను నిర్మించి వారి ప్రయోజనాల రక్షణకై ఐక్యకార్యాచరణకు తోడ్పడుటకు బదులుగా నాయకులను "బట్టబయలు" చేయు దృక్పథంతో పనిచేయడం జరుగుతుంది. ట్రేడ్ యూనియన్ ఐక్యతకై, అడ్డదార్లకై (Short cuts) ప్రయత్నిస్తారు. మరియు అతి తొందరలోనే గొప్ప ఫలితాలు కలుగుతాయని ఆశిస్తారు. ఒక ప్రత్యేక యూనియన్లో పనిచేయడం అసంభవమని, అందుకని మరో యూనియన్ను నిర్మించటం తప్పనిసరియని చాలాసార్లు వాదించబడుతుంది.

27. ట్రేడ్‌యూనియన్ ఒక పార్టీనిర్మాణమని, అదొక రాజకీయ పార్టీయని, క్రమశిక్షణకు కట్టుబడియుండాలని అన్న వాదాన్ని కమ్యూనిస్టుపార్టీ విశ్వసించ నిరాకరిస్తుంది. అఖిల భారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ లేక ఐ. యన్. టి. యు. సి. లేక హెచ్. ఎం. యస్. సంస్థలలో చేరియున్న ఏ ట్రేడ్ యూనియనైననూ, లేక స్వతంత్రంగాయున్న ఏ యూనియన్ అయినప్పటికీ ఆ సంఘాలు వారివారి ఫ్యాక్టరీల్లో, పరిశ్రమల్లో కార్మికులందరినీ ఐక్యపర్చి కార్మికవర్గ సమిష్టి ప్రయోజనాలని, ప్రజాస్వామిక ప్రయోజనాలని రక్షించడానికై నిర్మించబడ్డ కార్మిక సంస్థలే ఇవియని కమ్యూనిస్టుపార్టీయొక్క గట్టినమ్మకం. దీనికై ఆ సంఘాలు ప్రజాస్వామిక పద్ధతుల్లో నడుస్తూ అన్ని తరగతుల కార్మికుల్ని సభ్యులుగా చేర్చుకుని, వారందరికీ నాయకత్వపు కమిటీలలో ప్రాతినిధ్యం దొరుకుటకు గట్టిచర్యలు తీసుకోవాలి. అందుకనే కార్మికులున్న ప్రతి యూనియన్ లోను కమ్యూనిస్టులు పనిచేస్తారు. అదేవిధంగా మేము పని చేస్తూవున్న ప్రతిచోట మాతో ఐక్యతగా పనిచేయాలని మేము వాంఛిస్తాము. ట్రేడ్ యూనియన్ ఐక్యతే మాయొక్క దృఢ విశ్వాసం.

అంతేకాని దీన్ని మేము ఇతరులను "బట్టబయలు" చేయుటకై ఒక కుతంత్రంగానో, మరియు యూనియన్ను "కబ్జా" చేసుకొనుటకై ఒక ఎత్తుగడగానో అంగీకరించము. ఐక్య ట్రేడ్ యూనియన్ ఉద్యమమే కార్మిక వర్గానికి ఆయుధంగా ఉపయోగపడి వారి శత్రువులను ఓడించుటకై తగిన బలాన్ని చేకూరుస్తుంది.

28. ఐక్యతను, ఐక్య కార్యాచరణను వాంఛించడమంటే, విచ్ఛిన్నకారులవైపు, చీలికలు కల్పించువారివైపు మెత్తదనం (Mild) అవలంబించడంకాదు, కాని వీరిపై వారిని "బట్టబయలు" చేయుటకై తీవ్రమైన పదాలను ఉపయోగించడంగాక చాలా ఓపికతో పనిచేస్తూ చీలికలు కల్పించువారి కుతంత్రాలను, వారి ప్రత్యేకపాలసీలను కార్మికులకు తెల్పుతూ వారు తమ స్వానుభవంద్వారా చీలిక కల్పించువారి కార్యకలాపాల, అవి అపాయకరమైన పరిస్థితులకెలా దారి తీస్తాయో తెల్సుకొనుటకై కార్మికులకు మనం కాంక్రీటుగా సాయం చేయాలి.

29. ఇతర యూనియన్ల ఆధ్వర్యాన జరుగు పోరాటాలకు అండగా కార్మికులను సమీకరించటంలో కూడా యితర సంస్థలో చేరియున్న యూనియన్లవైపు మన సెక్టేరియన్ ధోరణి కనబడుతుంది. ఎన్నిసార్లు ఐ. ఎన్. టి. యు. సి, హెచ్. ఎం. ఎస్. కార్మికులు వీరోచితమయిన పోరాటం సాగిస్తున్న సమయాన ఎ. హెచ్. టి. యు. సి యూనియన్లు ఆ పోరాటాలను గమనించి, ఆ పోరాటాలతో తమ సానుభూతి ప్రదర్శించి ఆ విధంగా కార్యాచరణ రూపంలో మన ఐక్యతా వాంఛను తెల్పుతూ ఇట్టి ఐక్యకార్యాచరణవల్ల కార్మికులకు కల్గు లాభాలను చూపెట్టటంలో విఫలులమయ్యాము ?

30. కార్మికుల ప్రత్యేక కోర్కెలను సాధించుటకై వారి కార్యాచరణ, దృఢమైన పోరాటాలు మాత్రమే కాక ఇతర ప్రజల సహాయాన్ని సమీకరించుట కూడా అవసరమని మన అనుభవం తెల్పుతుంది. జిందా తిలస్మాత్ కార్మికులు, పాత గిర్ని

కార్మికులు కేవలం తమ గట్టిపోరాటాలవల్లనే కాక ఇతర ప్రజల సానుభూతి సహాయాలను కూడా సమీకరించినందున, జిందా తిలస్మాత్ ఫ్యాక్టరీని తిరిగి తెర్పించటం, మిల్లు మూసివేయబడి యుండిన పాతగిర్నీ కార్మికులకు చౌకధరలపై ప్రభుత్వం తిండి గింజలు సప్లయి చేయటం, వారి ప్రావిడెంటుఫండు డబ్బును తిరిగి యిచ్చివేయటం మొదలుగాగల వారి ప్రత్యేక కోర్కెలు ఎలా సాధించగల్గారో మనం చూశాం. ఈ ప్రజాసమీకరణ కేవలం పత్రికలద్వారానే కాక, ప్రజల్లో సంతకాలు సేకరించటంద్వారా, అసెంబ్లీలో ప్రశ్నలు వేయించటం మూలంగా, వివిధ బస్తీ ల్లో మీటింగులు జరుపుట ద్వారా కాంగ్రెసువారితోసహా అందరు ప్రజాస్వామిక దేశభక్తుల్ని సమీకరించగల్గాం. ఈ పద్ధ తినే మన ట్రేడ్ యూనియన్ పోరాటాలన్నింటిలోనూ అవలం బించాలి. అందుకై కార్మికుల కోర్కెలను సరిగా తయారు చేయటం, వాటిని సరియైన మార్గాన ప్రజలముందుంచటం ఆ విధంగా వాటిలోని న్యాయాన్ని గుర్తింపచేయుటకై ప్రజలకు తోడ్పడటంకూడా అవసరం.

31. దీనిఅర్థం మన ట్రేడ్ యూనియన్ పనిలో కేవలం సెక్టేరియన్ లేక ఆర్థికధోరణులమొక్క ప్రభావం మాత్రమే వుందనికాదు. ఎన్నోసార్లు కార్మికులను వారి ముఖ్యఆర్థిక కోర్కెలపై పోరాటాలనుండి వారిని వెనుకకులాగు ధోరణి, ఆర్థికమాంద్యంవున్న సమయంలో "తిరోగమన" (Defensive) పోరాటాలు సాగించాలని ఆ విధంగా ప్రస్తుత జీతాలను, ఉద్యోగాలను కాపాడుకోవాలన్న వాదనలతో కార్మికుల జీతాల హెచ్చింపు కోర్కెలను వెనుకకుపట్టించుధోరణి, యజమానులు

ఇవ్వగల శక్తి లేదన్న పెట్టుబడిదార్ల వాదనను విశ్వసించే ధోరణి, యజమానులు కార్మికులను "తీసివేయ" కుండుటకై ఒప్పుకున్నారని, మరియు తీవ్రవుతూన్న ఆర్థిక సంక్షోభ కాలంలో వెనుకబడ్డ దేశాల్లో క్రొత్తమిషన్లను (రేషనలైజేషన్) ఉపయోగించుట, కార్మికులపై పనిభారాన్ని పెంచి సరుకులు కొనువారికైననూ తోడ్పడకుండా తమ లాభాలను పెంచుకో డానికైనప్పటికీ, ఇట్టి రేషనలైజేషన్ ద్వారా ఉత్పత్తి పెరుగు తుందని, ధరలు తగ్గుతాయని, విదేశీసరుకులపోటీని జాతీ పరిశ్రమలు ఎదుర్కో-గలుగుతాయన్న వాదనలతో రేషనలై జేషన్ను బలపర్చు ధోరణులు మొదలగునవి ప్రదర్శింపబడి నాయి. ఇలాంటి అవకాశవాద ధోరణులు వివిధ సమయాల్లో, వివిధ ప్రదేశాల్లో ప్రకటితమైనాయి. వీటినుండి జాగ్రత్త వహించవలసియుంది.

32. చాలా కమిటీలు ప్రత్యేకంగా తెలంగాణాలోని కొన్ని పట్టణాలలో ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని నిర్మించు టకు తగినంత శ్రద్ధతీసుకోవటంలేదు. శ్రామిక ప్రజలను నిర్మా ణంలోకి తీసుకురావటానికి సరియైన కృషిజరగటంలేదు. ట్రేడ్ యూనియన్ ఉద్యమ మున్నప్పటికీ కొన్ని పార్టీకమిటీలు వాటిని సరియైన మార్గాన నడుపుటకు, నాయకత్వం వహించుటకు తగి నంత శ్రద్ధతీసుకోవటంలేదు. ప్రధాన కేంద్రాలను వదిలిపెట్టి చిన్న చిన్న యూనియన్ల పనిలో మునిగిపోయే దృక్పథం కనపడుతున్నది. ప్రధాన పారిశ్రామిక కేంద్రాలలోనే కష్ట జీవులు, కార్మికులు కేంద్రీకరించబడి వుంటారు. ఈ కార్మికవర్గ పోరాటమే ట్రేడ్ యూనియన్ ఉద్యమములో మార్పు తెచ్చు

టకు ముఖ్యమైన పాత్రవహించుతుంది. మొత్తం కార్మిక వర్గంలో విశ్వాసాన్ని, బలాన్ని చేకూర్చి ప్రజాస్వామిక ఉద్య మానికి మార్గాన్ని చూపెట్టుతుంది.

33. వీటన్నిటికన్న ముఖ్యమైనదేమంటే కార్మిక రంగంలో మన పనివిధాన బలహీనత. ట్రేడ్ యూనియన్ రంగంలో మనం పనిచేస్తూనే వున్నాం కాని, కార్మికవర్గంలో మన పార్టీని తీసుకపోవడం లేదు. కార్మికవర్గంలోని గట్టివారిని మన పార్టీలోకి తీసుకొని మన పార్టీని నిర్మించే కర్తవ్యాన్ని నిర్వహించటం లేదు.

34. అందుచే మనఎదుట ఈ కర్తవ్యాలున్నాయి: ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని నిర్మించుటకు, నిర్మాణంలో లేనివారిని నిర్మాణంలో పెట్టుటకు, పోరాటంలో ఐక్యతను సాధించుటకు, మన ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని ప్రధాన కేంద్రాల్లో కేంద్రీకరించాలె. ఎడ తెగకుండా ట్రేడ్ యూనియన్ సభ్యత్వాన్ని పెంచుతూ ప్రజాస్వామిక పద్ధతులపైన కార్యకలాపాలు సాగిస్తూ విశాల మైన ట్రేడ్ యూనియన్ను నిర్మించాలె. యూనియన్ యొక్క కార్యకలాపాలు నిరంతరంగా సాగిస్తూ హక్కుల రక్షణకొరకు, కోర్కెల సాధించుటకు, మరింత సుదృఢమైన ఐక్యత పోరా టాల్లో సాధించుటకు, కార్మికుల చొరవను పెంచుటకు కృషి చేయాలె. కార్మికులు ఎక్కడున్నా, విశాలమైన ప్రజా స్వామిక ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని నిర్మించుటకు, ట్రేడ్ యూనియన్ హక్కులను కాపాడుటకు, కోర్కెలను సాధించుటకు పోరాటంలో ఐక్యతను సాధించే దృక్పథంతో పని చేయాలె. కార్మికవర్గ చైతన్యాన్ని, పోరాటశక్తిని పెంచుటకు

ఎడతెగని రాజకీయ ప్రచారం చేయాలె. ట్రేడ్ యూనియన్ మరియు రాజకీయశిక్షణ నివ్వాలె. పోరాడే యితర ప్రజానీకానికి ప్రత్యేకంగా రైతాంగ హక్కుల రక్షణకు కార్మికవర్గాన్ని సమీకరించాలె. అన్నిటికన్న ముఖ్యమైన శాంతి ఉద్యమాన్ని కార్మికుల్లోకి తీసుకపోవాలె. శాంతిలేనిదే కార్మికవర్గ జీవిత పరిస్థితులను బాగుపర్చుటకు ఏ ఉద్యమం గూడా సరిపోదు. కార్మికుల హక్కుల రక్షణకొరకు, పోరాటంలో ఐక్యత సాధించుటకు, యజమానుల, ప్రభుత్వదాడిని యెదుర్కొనుటకు, కార్మికుల చొరవను పెంచుటకు, సెక్టేరియన్. మరియు అవకాశవాద దృక్పథాన్ని విడనాడాలె.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B128 |
| పుస్తకం పేరు | ప్రజల మనిషి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 123 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | rehana |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |